# కందుకూరి వీరేశలింగం

వీరేశలింగానికి మద్రాసు మీద మోజు తగ్గింది. రాజమహేంద్రవరం మీద దృష్టి మళ్లింది. చెన్నపట్నంలో ఉన్న సమయంలో పది వితంతు వివాహాలు జరిపించాడు. స్వగ్రామం వెడితే అక్కడ ఇంకా పని చెయ్యవచ్చునని నిశ్చయించుకున్నాడు.

1905 లో రాజమహేంద్రవరం చేరాడు.



రాజమహేంద్రవరం తిరిగి వచ్చిన తరువాత బాలికల కోసం తన ఇంట్లోనే విక్టోరియా బాలికా పాఠశాల స్థాపించాడు. మొదట్లో నలుగురు బాలికలు, వారంలో 47 మందయ్యారు.



ఆరు నెలల్లో 150 మంది. సంవత్సరం దాటే సరికి 300 మంది




ఆ రోజుల్లోనే వీరేశలింగం తన దగ్గర ఉన్న డబ్బులతో ఒక తోట కొన్నాడు.




వితంతు శరణాలయం కట్టడానికి డబ్బు లేదు. ఈ సంగతి ప్రసిద్ధ న్యాయవాది వీరేశలింగం శిష్యుడు అయిన ముల్లపూడి అచ్యుత రామయ్యకు తెలిసింది. ఆ నిర్మాణానికి కావలసిన డబ్బు ఆయన ఇచ్చి, గురువు గారి ఋణం తీర్చుకున్నాడు.




తన ఆశయాలను అభిప్రాయాలనూ చెప్పడానికి "సత్యవాదిని" అని ఇంగ్లీషు తెలుగు భాషలలో ఒక వార పత్రిక ప్రారంభించాడు. అందులో అతి తేలిక పలుకుబడులుగా వ్రాసేవాడు -




మిస్ మ్యానింగ్ అనే ఆమె వీరేశలింగం గురించి విన్నది. ఆమె చనిపోతూ ఆస్తిలో తన అనంతరం 50 పౌన్లు వీరేశలింగానికి ఇవ్వాలని తన విల్లులో వ్రాసింది. అది అందింది.




1906 లో వీరేశలింగం అనుష్ఠాన బ్రాహ్మ్యుడుగా అయ్యాడు. సర్వ కులాల వారితో సహపంక్తి భోజనం చేశాడు. యజ్ఞోపవీతం తీశాడు.



1906 లో వీరేశలింగం 'హితకారిణీ' సమాజం స్థాపించాడు. దీని ద్వారా తాను తలపెట్టిన కార్యాలన్నీ నెరవేర్చడానికి. 36 మంది సభ్యులను చేర్చాడు. - ట్రస్టు చేశాడు.



# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 21 జూలై, 1977 ఆషాఢ-శ్రావణ, 1899 శా.శ. సంచిక : 9

ప్రధాన సంపాదకులు :
శ్రీరాజ్యం సిన్హా

సంపాదకులు :
కుందుర్తి ఆంజనేయులు

ముఖ చిత్రం : ప్రగతి చక్ర పరిభ్రమణం

రెండు, మూడు కవరు పేజీలు: కందుకూరి వీరేశలింగం జీవిత చరిత్ర (బుజ్జాయి బొమ్మల చిత్రాలు)

చివరి కవరు పేజీ : సస్య విప్లవం

వెల: 50 పైసలు

సాలుచందా . ఆరు రూపాయలు

ప్రచురణ :
డైరెక్టరు,
సమాచార, పౌర సంబంధ శాఖ,
హైదరాబాద్

ముద్రణ :
డైరెక్టర్,
ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం,
హైదరాబాద్.

రిజిస్టరు నెం : హెచ్. హెచ్. డి. 81



## ఈ సంచికలో...

పేజీ

# అమృతంగమయ

—శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

పచ్చ సీమలలోన పసిడిపంటలు పండ
పొలము దున్నే ప్రజలు కలిమి బలిపింపంగ
ప్రజల మోములలోన మొలక నవ్వులు వెలయ
ఇదమన్న మిదమన్న మిదమన్నమని పిలుతురెవరో-

మదిలోన మమతలే దండిగా చిగురింప
ప్రతి నిస్వనములోన పరమార్థ మొలికింప
హృదిలోన శుభ తూర్య నాదాలు వినిపింప
లోని శత్రుల మూక అణగారి పోవంగ
మనసులో పొరలనే మెత్తగా కదిలింతురెవరో-

హిమశైల సానువుల ఋషుల ఓంకారమ్ము
వింధ్యాద్రి వనరాజి విజ్ఞాన ఫలపాళి
సాగరేశ్వర గర్భశుక్తి ముక్తాకాంతి
భరతపుత్రుల మేధ పెంపొందగా జూతురెవరో-

గంగా తరంగాల కమ్మ తెమ్మర లూచి
ఓషధీ లతలతో వనదేవతల నూచి
సెలయేటి అలలపై ప్రకృతి కన్నెలనూచి
చల్లగా ప్రాణాలు సుల్లసిల్లగ జేతురెవరో-

దివిలోన ముక్కోటి దేవతలు హసియింప
భువిలోన భూతసంఘమ్ము పులకింప
ఇహపరమ్ముల పంట భూమి జనుల కంట
విజ్ఞాన నిధులైన వేయికన్నుల జూతురెవరో-

కొండకొమ్ములు నేల తడబాటు పడుచుండిరో
అద్ధికెర వెడలి వెలికి రారేలనో
చెట్టులో పుట్టలో చివురాకు పొదలలో
దాగి దాగుడుమూతలాడు చుండెదరేలనో

భారతీయుల మమ్మ మేము !
మాభాగ్య కల్పనా కామధేనువులు మీరు
అన్నమయ, ప్రాణమయ, మనోమయ
విజ్ఞానమయ ఆనందమయ కోశములవోలె

మాదేశ ప్రణాళికా కోశముల
చిత్తశుద్ధియు, నిత్యనూత్న చైతన్యమ్ము
స్వార్థరాహిత్యమ్ము మాలోన లేవంచు
దరియంగ రారేమి ? అపవిత్రులము
అయోగ్యుల మంచు
తిండి తీర్థము లేక కడుపు మాడినవేళ

ఎండమాడ్చిన చోట బట్ట కట్టగ లేక
బడగులై వరుగులై వాడిరాలెడు వేళ
చిత్తశుద్ధిగ చేయుమంటి మీ శపథమ్ము
దిగిరండు దిగిరండు దేవసురభుల్లార
భారతక్షేత్రాల పసిడి నిగ్గులు దేల

ఈ నాళికాతతుల మా ప్రణాళికలలో
మీ కరుణారస క్షీరధారలే పొరలంగ
అమృతప్రధానమ్ము సమరింప రారండు, రారండు
మృత్యోర్మామృతంగమయ.

# ఆంధ్రప్రదేశ్ బడ్జెటు 1977-78

ఆర్థిక శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డిగారు 1977-78 సంవత్సరపు బడ్జెటును జూన్ 17 వ తేదీన శాసన సభలోను, శాసన మండలిలోను ప్రవేశపెట్టారు. బడ్జెటు ప్రసంగంలోని కొన్ని భాగాలు.



"1977 మార్చిలో జరిగిన స్వల్ప కాల శాసన సభా సమావేశంలో నాలుగు నెలల కోసం తాత్కాలిక బడ్జెటును ఆమోదించిన విషయం గౌరవనీయ సభ్యులకు తెలిసిందే. అప్పట్లో బడ్జెటును వివరంగా పరిశీలించడానికి అవకాశం లేనందున ఆ విధంగా చేయడం జరిగింది. పూర్తి బడ్జెటు తర్వాత ప్రవేశపెట్టడం జరుగుతుందని కూడా నేను అప్పట్లో మనవి చేశాను.

"తాత్కాలిక బడ్జెట్ ప్రవేశ పెట్టిన సమయంలో, యిరవై సూత్రాల పథకం అమలు జరుపడంలో మనం సాధించిన ప్రగతి గురించీ, 1977-78 సంవత్సరపు వార్షిక ప్రణాళిక పథకాలలోని కొన్ని ముఖ్యంశాలను గురించీ నేను క్లుప్తంగా సమీక్షించిన విషయం కూడా గౌరవనీయ సభ్యులకు గుర్తు వుండే వుంటుంది.

"రాష్ట్ర ఆర్థిక స్థితిగతులను గురించి లోగడనే వివరించాను. కాబట్టి మళ్ళీ ఆర్థిక పరిస్థితిని గురించి ప్రస్తావించను. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో అనావృష్టి కారణంగానూ, మరికొన్ని చోట్ల వరుసగా తుఫానులు సంభవించిన కారణంగానూ ఖరీఫ్ సీజనులో పంట బాగా పడిపోయిందనే విషయం అప్పట్లో చెప్పాను. అటు తర్వాత రబీ పంట విస్తీర్ణంలోనూ, చిరు ధాన్యాలూ, పప్పు ధాన్యాల విస్తీర్ణంలోనూ, తగ్గుదల కనిపించింది. ఖరీఫ్ తరుణంలోనూ, రబీ తరుణంలోనూ, పంట తగ్గిన కారణంగా 1976-77 సంవత్సరపు ఆహార ధాన్యాల ఉత్పత్తి 1975-76 సంవత్సరపు ఉత్పత్తి కంటే చాలా తక్కువగా వుంటుందనే విషయం స్పష్టంగా తెలుస్తున్నది. ఆ సంవత్సరపు రాష్ట్ర ఆదాయం మీద దీని ప్రభావం సహజంగా పడుతుంది. కాని, పరిశ్రమల రంగంలో సాధించిన ఘన విజయాల వల్లనూ, తృతీయస్థాయి రంగాలలో స్థిరమైన పెరుగుదల కనిపిస్తున్నందువల్లనూ రాష్ట్ర ఆదాయం మీద పడిన దుష్ప్రభావం కొంతవరకు సర్దుకున్నది.

"1976 ప్రథమ భాగం వరకు తగ్గు ముఖంగా వున్న ధరల విషయంలో పెరుగుదల కనిపిస్తున్నప్పటికీ యింకా అవి 1975 శిఖర స్థాయిని చేరుకున్నప్పటి కంటే తక్కువ స్థాయిలోనే వున్నాయని కూడా నేను అప్పట్లో మనవి చేసి వున్నాను. ఏమైనప్పటికీ ధరల పెరుగుదల ఒక ముఖ్యాంశంగా తయారయింది. ముఖ్యంగా జన సామాన్యం నిత్యం వాడుకునే ఖాద్యతైలాలు, పప్పులు మొదలగు విషయాలలో జాగ్రత్త వహించవలసి వుంటుంది. అయితే ధర వరలను అజమాయిషీ చేసే సాధనాలు చాలా వరకు రాష్ట్ర ప్రభుత్వ స్వాధీనంలో కాక కేంద్ర ప్రభుత్వ స్వాధీనంలోనే వున్నాయి.

## ప్రణాళిక పెట్టుబడులు

వార్షిక ప్రణాళిక పెట్టుబడులను గురించి ప్రస్తావించి ఆర్థిక మంత్రి యిలా అన్నారు: "తాత్కాలిక బడ్జెటులో 1977-78 వార్షిక ప్రణాళిక రు. 365.75 కోట్లు. అంతకు ముందు సంవత్సరం, అంటే 1976-77 లో యీ మొత్తం రూ. 290.38 కోట్లు. 1977-78 వార్షిక ప్రణాళిక యిప్పుడు యింకా రూ.380.38 కోట్ల వరకు పెంచబడింది. విద్యుచ్ఛక్తి, సేద్యపు నీటి పారుదల వంటి మౌలిక రంగాలకు అదనపు కేటాయింపులు చేయడానికీ, బలహీన వర్గాల ప్రజలకు సంబంధించిన అభివృద్ధి కార్యక్రమాలను పెంచడానికి యీ విధంగా చేశాము. ఇప్పుడు జరిగిన అదనపు కేటాయింపులలో ప్రధానమైనవి : గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు రూ. 5 కోట్లు, మధ్యతరహా సేద్యపు నీటి పారుదల పథకాలకు రూ. 4 కోట్లు, చిన్న తరహా సేద్యపు నీటి పథకాలకు ఒక కోటి, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర నిర్మాణాల సంస్థకు ఒక కోటి, షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులు, స్త్రీలు ఇతర బలహీన వర్గాల ప్రజలకు ఉద్దేశించిన పథకాల కోసం రూ. 2.90 కోట్లు.

## వివిధ రంగాలకు కేటాయింపులు

వ్యవసాయం మొదలగు అభివృద్ధి రంగాలలో జరిగిన కేటాయింపుల వివరాలు : "వ్యవసాయం, దానికి సంబంధించిన సేవా కార్యక్రమాల కోసం 1976–77 లో రూ. 19.99 కోట్ల కేటాయింపు జరిగితే, 1977–78 లో దీనిని రూ. 28.58 కోట్లకు పెంచటం జరిగింది.

"వ్యవసాయానికి ఈ సంవత్సరపు కేటాయింపు రూ. 6.90 కోట్లు. 1976–77 లో ఈ మొత్తం రూ. 5.18 కోట్లు మాత్రమే. అధిక దిగుబడి వంగడాల వినియోగం ఎక్కువ విస్తీర్ణంలో జరగాలని లక్ష్యాలు నిర్ణయించబడినవి. ఒక్క సజ్జ పంట విషయంలో తప్ప యీ లక్ష్యాలను అధిగమించడం జరిగింది. వ్యవసాయాభివృద్ధికి కావలసిన ప్రధానాంశం రసాయనిక ఎరువులు. యిప్పుడు రసాయనిక ఎరువుల విషయంలో కొరత ఏమీ లేదు. రైతులకు అవసరమైన రకరకాల ఎరువులు సకాలంలోనే అందించబడుతున్నాయి.

## పశు పోషణ

"మన రాష్ట్రంలో 19 జిల్లాలలో సన్నకారు, చిన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికుల ప్రయోజనాల కోసం, పశుపోషణ రంగంలో ప్రత్యేక కార్యక్రమాలు చేపట్టి నిర్వహిస్తున్నారు. ఈ ప్రత్యేక పథకాలు కేంద్ర ప్రభుత్వం ప్రారంభించినట్టివి.

"గ్రామీణ ప్రాంతాలలో బలహీనవర్గాల ప్రజలకు అదనపు ఆదాయపు వనరులు కల్పించడానికి వీలుగా పాల ఉత్పత్తి, గొర్రెల పెంపకం, పందుల పెంపకం, కోళ్ళ పెంపకం మొదలగు ఉత్పత్తి కార్యక్రమాలను అమలు పరచవలసిందని వ్యవసాయ విషయాల జాతీయ కమీషన్ సిఫార్సు చేసింది. మన రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వం ఇటువంటి 19 పథకాలను ప్రవేశపెట్టింది.

## మత్స్య పరిశ్రమ

"1977–78 సంవత్సరానికి మత్స్య పరిశ్రమ కార్యక్రమాల క్రింద కేటాయింపు రూ. 20 లక్షలు పెంచడం జరిగింది. కాకినాడలో పడవలు సరుకు దింపే సౌకర్యాలు పెంపొందించడానికి వీలుగా చేపల రేవు రెండవ దశ నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం యిటీవలనే రూ. 77 లక్షలు మంజూరు చేసింది. దీనికోసం అవసరమైన రోడ్లు, విద్యుచ్ఛక్తి, నీరు మొదలగు సౌకర్యాలను రూ. 17 లక్షల ఖర్చుతో సమకూర్చడానికి రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది. ఈ పథకం మీద మొత్తం రూ. 94 లక్షలు ఖర్చు అవుతుంది. దీనివల్ల సుమారు 150 యాంత్రిక పడవలు రేవులో నిలిచివుండడానికీ, సరుకు దించడానికీ అవకాశం కలుగుతుంది. చేపల రేవుల మొదటి దశ, రెండవ దశ నిర్మాణాలవల్ల సంవత్సరానికి 15 వేల టన్నుల చేపలు లభ్యమవుతాయని అంచనా. వీటిలో 3 వేల టన్నుల వరకు రొయ్యలు. వీటి విలువ రూ. 15 కోట్లవరకు ఉంటుంది.

## ఖారీ సేద్యపు నీటి పారుదల పథకాలు

"మార్చినెల బడ్జెట్ ప్రసంగంలో నేను సూచించిన విధంగా, గోదావరి మీద ధవళేశ్వరం వైపు ఆనకట్టవద్ద పడిన గండిని పూడ్చడం జరిగింది. గండి పడక పూర్వం ఆనకట్ట ఏ స్థితిలో వుందో ఆ స్థితికి మళ్ళీ యిప్పుడు వచ్చింది. యిటీవలనే మన ముఖ్యమంత్రిగారు తూర్పు డెల్టా ప్రాంతాలకు నీరు విడుదల చేశారు కూడా. గోదావరి బ్యారేజి నిర్మాణ కార్యక్రమాన్ని త్వరితం చేయడానికిగాను యీ యేటి బడ్జెటులో రూ. 11 కోట్లు కేటాయించాం.

## మధ్యతరహా, చిన్నతరహా సేద్యపు నీటి పారుదల

"1977–78 సంవత్సరపు తాత్కాలిక బడ్జెటులో మధ్యతరహా నీటిపారుదల పథకాలకు రూ. 34.82 కోట్ల మొత్తం కేటాయించిన విషయం గౌరవనీయ సభ్యులకు తెలిసిందే. ఈ పథకాలకు వుండే ప్రాధాన్యం దృష్ట్యా యీ మొత్తాన్ని యింకా రూ. 3 కోట్లు ఎక్కువగా పెంచాం. యిప్పుడు మొత్తం యీ యేటికి కేటాయింపు రూ. 37.82 కోట్లు అయింది. ఇదికాక తమ్మిలేరు పథకానికి అదనంగా ఒక కోటి రూపాయలు కేటాయించాం.

"ఈ పద్దు క్రింద చూపిన మొత్తాన్ని ముఖ్యంగా నాలుగు పెద్ద ప్రాజెక్టులమీద, అంటే తుంగభద్ర ఎగువకాలువ రెండవదశ, వంశధార, నిజాం సాగర్, సోమశిల అనే నాలుగు పథకాల మీద ఖర్చు చేస్తారు. ఇవికాక 21 కొత్త ప్రాజెక్టులు, 9 పని మిగిలివున్న మధ్యతరహా సేద్యపు నీటిపారుదల ప్రాజెక్టులు, యింకా ప్రాజెక్టుల ప్రాథమిక పరిశీలన, యింజనీరింగ్ పరిశోధన, రాష్ట్రంలో జల మార్గాలద్వారా రవాణా సౌకర్యాలకేకాక కేంద్ర డిజైనుల సంస్థ, ఆధునీకరణ కేంద్రస్థాపన, మెట్రిక్ పద్ధతి అమలు మొదలగు రాష్ట్ర వ్యాపిత పథకాలు ప్రారంభించుటకు కూడా యీ మొత్తంలో నుంచి ఖర్చు జరుగుతుంది. 1977–78 సంవత్సరలో పైనాలుగు పెద్ద పథకాలక్రింద అదనంగా 55,270 హెక్టార్లకు సేద్యపునీటి పారుదల అవకాశాలు లభిస్తాయని అంచనా.

"1974 సెప్టెంబరు నెలలో రూ. 10 కోట్ల అధికృత వాటాధనంతో ప్రారంభమైన రాష్ట్ర యిరిగేషన్ అభివృద్ధి కార్పొరేషన్ వారు,రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలు, గిరిజన ప్రాంతాలకు ప్రయోజనకరమైన అనేక లిఫ్ట్‌యిరిగేషన్ పథకాలు, గొట్టపు బావుల త్రవ్వకం పథకాలను పరిశీలించి చేపట్టి, అమలు పరుస్తున్నారు. రాష్ట్రంలో రూ. 2.93 కోట్ల ఖర్చుతో యీ కార్పొరేషన్ వారు 250 గొట్టపు బావుల త్రవ్వకం పథకాలను రూపొందించారు. ఈ బావుల క్రింద 1977–78 సంవత్సరంలో 5 వేల హెక్టార్లలో ఖరీఫ్ వరిపంట, 10 వేల హెక్టార్లలో రబీకాలంలో నీటి పారుదలతో పెరిగే మెట్టపంటలు పండించవచ్చునని అంచనా. 1977–78 సంవత్సరంలో యీ కార్పొరేషన్ వాటాధనంగా విడుదలచేయడానికి ప్రణాళికలో కోటి రూపాయలు కేటాయించారు.

## విద్యుచ్ఛక్తి పథకాలు

"తాత్కాలిక బడ్జెటులో విద్యుచ్ఛక్తి పథకాల కింద రూ.140 కోట్లు కేటాయింపు జరిగినట్లు గౌరవనీయ సభ్యులకు తెలుసు.

ఇందులో శ్రీశైలం ప్రాజెక్టుకు రూ.32 కోట్లు, కొత్తగూడెం పథకానికి రూ. 12.30 కోట్లు, విజయవాడ థర్మల్ పథకానికి రూ. 41 కోట్లు, గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు రూ. 12.85 కోట్లు, విద్యుచ్ఛక్తి రవాణా, పంపిణీ కార్యక్రమాలకు రూ. 23.80 కోట్లు వున్నాయి. గ్రామీణ విద్యుదీకరణ పథకాల మీద కేటాయింపు యింకా రూ. 5 కోట్లు పెంచాము. యిప్పుడు యీ పద్దు క్రింద మొత్తం రూ. 17.85 కోట్ల కేటాయింపు జరిగింది. గ్రామీణ విద్యుదీకరణ పథకాలను విస్తృతపరచడానికై యీ విధంగా పెంచడం జరిగింది.

"కొత్తగూడెం పథకం క్రింద 110 మెగావాట్ల శక్తిగల 7వ యూనిట్ పనిచేయడం ప్రారంభించింది. మరొక యూనిట్ కొద్ది నెలల్లో ప్రారంభమవుతుంది. ఈ సంవత్సరంలోనే దిగువ సీలేరు వద్ద 3వ, 4వ యూనిట్లు కూడా పని ప్రారంభిస్తాయి.

"నాగార్జునసాగర్ జలవిద్యుత్పథకం క్రింద పనులు చురుకుగా కొనసాగుతున్నవి. ఈ సంవత్సరం 110 మెగావాట్ల శక్తిగల సాంప్రదాయిక పద్ధతి విద్యుచ్ఛక్తి యంత్రం పని ప్రారంభిస్తుంది. శ్రీశైలం ప్రాజెక్టు క్రింద కూడా వేగస్థాయి ఏ మాత్రం తగ్గకుండా పనులు చురుకుగా జరుగుతున్నవి.

"సౌదీఅరేబియా అభివృద్ధినిధి నుండి, శ్రీశైలం, నాగార్జునసాగర్ జలవిద్యుత్పథకాల అమలుకోసం 353 మిలియనుల సౌదీరియాల్‌లు, (అంటే 100 మిలియనుల అమెరికన్ డాలర్లు) రుణ సహాయం కూడా లభించడం మనందరికీ సంతోషకరమైన వార్త.

"గ్రామాలకూ, హరిజన వాడలకూ విద్యుచ్ఛక్తి సరఫరాచేసే విషయాలలో అత్యంత శ్రద్ధ వహించబడుతున్నది. మొత్తం 27,221 గ్రామాలకుగాను యింత వరకు 13,496 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం ఏర్పడిది. గ్రామాలతోపాటు వాటి హరిజన వాడలకుకూడా విద్యుచ్ఛక్తి యివ్వాలనే విధానం అనుసరించబడుతున్నది. 1977–78 సంవత్సరలో కొత్తగా 1750 గ్రామాలకు విద్యుచ్ఛక్తి యివ్వాలనీ, 27,000 వ్యవసాయపు పంపుసెట్లకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయాలని సంకల్పించబడింది.

## పరిశ్రమలు

"వర్షిక ప్రణాళికలో 1976–77లో పరిశ్రమల రంగానికి రూ. 7.57 కోట్లు కేటాయించబడింది. దీనిని యీ యేటి ప్రణాళికలో రూ. 8.03 కోట్లకు పెంచాము.

"ఇదికాక సహకార పంచదార ఫ్యాక్టరీలకోసం యీ యేటి బడ్జెటులో అదనంగా రూ. 4.21 కోట్లు కేటాయింపు జరిగింది. ఈ రంగానికి పెరుగుతున్న ప్రాధాన్యం దృష్ట్యా ఈ అదనపు కేటాయింపు జరిగింది, ప్రణాళికలోనూ, ఆరు సూత్రాల పథకం క్రిందనూ లభించే మొత్తాలతో యీ యేడు ఆరు సహకార పంచదార ఫ్యాక్టరీల నిర్మాణం ప్రారంభమవుతుంది. నెల్లూరు జిల్లా కోవూరులోనూ, ఖమ్మం జిల్లా పాలేరులోనూ, కర్నూలు జిల్లా నంద్యాలలోనూ, కృష్ణా జిల్లా హనుమాన్ జంక్షన్‌లోనూ, గుంటూరు జిల్లాలో గురజాల, తెనాలిలలోనూ యీ ఫ్యాక్టరీలు నిర్మాణం అవుతాయి, యివి కాక యిటీవలనే నిజాం పంచదార ఫ్యాక్టరీవారు అనంతపురం జిల్లా హిందూపురంలో పంచదార ఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభించారు. మిర్యాలగూడెంలోని పంచదార ఫ్యాక్టరీ యీ యేడు మార్చి నెలలో పని ప్రారంభించింది.

## గ్రామీణ, పట్టణ ప్రాంతాల నీటి సప్లై

"గ్రామీణ ప్రాంతాల నీటి సప్లయి పథకాలక్రింద ప్రధాన గ్రామాలకేకాక శివారు గ్రామాలకూ హరిజనవాడలకూ కూడా త్రాగడానికి మంచినీటి సరఫరా చేయడానికి మనం కృషి చేస్తున్నాం. 1977–78 సంవత్సరానికి గ్రామీణ ప్రాంతాల్లో నీటి సప్లయి పథకాలకు రూ. 4.25 కోట్లు కేటాయించడం జరిగింది, ఇందులో రక్షిత (పంపులద్వారా) నీటి సప్లయి పథకాలకు ఖర్చు అయ్యే రూ. 1.08 కోట్లు కూడా కలిసి వున్నది. ఈ ఏటికి చేసిన కేటాయింపునకు తోడు ఇంకా రూ. 1.17 కోట్లు ఆరు సూత్రాల పథకం నిధులనుండి సమకూర్చడం జరుగుతుంది.

"ప్రభుత్వోద్యోగులు సొంత ఇండ్లు నిర్మించుకునేందుకు వీలుగా సహకార రంగంలో ఒక పథకం అమలు జరుగుతున్నది. ప్రభుత్వోద్యోగుల సహకార గృహ నిర్మాణ సంఘాల తరపున ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ సంస్థ వారు స్వల్పాదాయ తరగతుల గృహనిర్మాణాన్ని చేపడతారు. ఈ సహకారసంఘాలు నిర్మించ దలచిన మధ్య ఆదాయ తరగతి గృహాల నిర్మాణానికి, సహకార గృహ నిర్మాణ సంఘాల ఫెడరేషన్‌వారు ఆర్థిక సహాయం అందిస్తారు. గృహనిర్మాణానికి అడ్వాన్సులుగా ఖర్చులో 25% వరకు ఇవ్వటానికి ప్రభుత్వం అంగీకరించింది.

"జంటనగరాలలో మురికిపేటలలోని ఇండ్ల పునర్నిర్మాణానికీ, మురికిపేట వాసుల పునరావాసానికీ సంబంధించి, ఒక సమగ్ర పథకం అమలు జరుగుతున్నది. ఈ ప్రాంతాలలో పరిసరాల అభివృద్ధి కార్యక్రమాన్ని హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్‌వారు, హైదరాబాదు నగర అభివృద్ధి సంస్థ వారు నిర్వహిస్తున్నారు. ఆమోదించిన ప్లానులు, డిజైన్ల ప్రకారం మురికిపేట వాసులు తమ ఇండ్లను పునర్నిర్మించుకోడానికి ఒక్కొక్కరికి రూ. 4 వేల వరకు వ్యాపార బ్యాంకులు రుణాలు మంజూరుచేస్తాయి. ఇటువంటి పథకాలే విశాఖపట్నం, విజయవాడ, గుంటూరు పట్టణాల్లో కూడా చేపట్టడం జరుగుతుంది.

"ఇళ్ళ స్థలాల సేకరణకోసం కేటాయించిన రూ. 4 కోట్ల మొత్తం ఇప్పుడు రూ. 5 కోట్లకు పెంచబడింది. అదే విధంగా ఆంధ్ర ప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక కార్పొరేషన్ అమలుపరిచే పథకాల కోసం జరిగిన కేటాయింపు రూ. 1.52 కోట్ల వరకు పెంచబడింది. ఆంధ్ర ప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక కార్పొరేషన్ అమలు పరిచే పథకాల కేటాయింపు రూ. 1.01 కోట్లకు పెంచారు. గత కొలది నెలలలో ఈ కార్పొరేషనులు సమాజంలోని బలహీన వర్గాల ప్రజలకు చాలా పెద్ద మొత్తా

లలో రుణాలను మంజూరు చేయటం సంతోషకరమైన విషయం. ఆంధ్ర ప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక కార్పొరేషన్ వారు యింతవరకు రూ. 14.99 కోట్లు అడ్వాన్సులు మంజూరు చేశారు. వీటి వల్ల 1,00,982 మందికి ప్రయోజనం కలిగింది. అదే విధంగా 99,643 మందికి ప్రయోజనం కలిగిస్తూ ఆంధ్ర ప్రదేశ్ వెనుకబడిన తరగతుల సహకార ఆర్థిక కార్పొరేషన్ వారు రూ. 16.68 కోట్ల రుణాలు మంజూరు చేశారు. ఆంధ్ర ప్రదేశ్ షెడ్యూలు జాతుల సహకార ఆర్థిక కార్పొరేషన్ మంజూరు చేసిన రూ. 38.89 లక్షల మొత్తం వ 3,567 మందికి లాభం చేకూరింది.

"లోగడ నేను మనవి చేసినట్లు, రాష్ట్రంలో హాస్టలు సౌకర్యాలు వినియోగించుకుంటున్న షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు యిచ్చే ఆహారపు ఖర్చుల పరిమితిని ప్రభుత్వం ఇటీవల పెంచింది. సంవత్సరానికి రెండు జతల దుస్తులు లభించే విధంగా దుస్తుల పరిమితికూడా పెంచబడింది. ఇందుకోసం ఒక కోటి రూపాయలు అదనంగా కేటాయించారు. అదే విధంగా పారిశ్రామిక శిక్షణ సంస్థలలోని షెడ్యూలు కులాల విద్యార్థులకు యిచ్చే స్టయిపండు నెలకూ రూ. 40 నుండి రూ. 75కు పెంచబడింది. ఆర్థికంగా వెనుకబడి వున్న తరగతుల సంక్షేమం కోసం ప్రణాళికలో రూ. 45 లక్షలు కేటాయింపు జరిగింది.

"షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన వర్గాలకు చెందిన విద్యార్థుల కోసం హాస్టళ్ళను నిర్మించడానికి, వ్యాపార బ్యాంకుల ద్వారా తీసుకున్న రుణాలతో ప్రభుత్వం రూ. 2 కోట్లు ఖర్చయ్యే కార్యక్రమాన్ని ప్రారంభించింది. షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ఉచితంగా జాతీయం చేయబడిన పాఠ్య పుస్తకాలను యివ్వడం కోసం రూ. 58.51 లక్షలు కేటాయించబడింది. మెట్రిక్యులేషన్ స్థాయి వరకు చదువుతున్న షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతుల విద్యార్థులందరికీ ఉచితంగా పాఠ్య గ్రంథాలు సప్లై చేయడంలో మొదటిసారిగా నూరుశాతం ఫలితం సాధించగలిగాము.

## అనావృష్టి ప్రాంతాల, సన్నకారు రైతుల అభివృద్ధి పథకాలు

"అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, మహబూబ్‌నగర్, నల్లగొండ, ప్రకాశం జిల్లాలలో అమలు జరుగుతున్న అనావృష్టి ప్రాంతాల సహాయక పథకం ఈ ఏడు కూడా అమలు జరుగుతుంది. ఈ పథకం క్రింద ఈ ఏడు మొత్తం ఖర్చు రూ. 9.04 కోట్లకు గాను రాష్ట్ర ప్రభుత్వపు సరికి సరి వాటాగా రూ. 4.52 కోట్లు కేటాయించడం జరిగింది.

"సన్నకారు రైతులకు, చిన్నకారు రైతులకు వ్యవసాయ కార్మికులకు ఉద్దేశించి మన రాష్ట్రంలో 16 అభివృద్ధి పథకాలు అమలు జరుగుతున్న విషయం గౌరవనీయ సభ్యులకు తెలిసిందే. ఈ పథకాల ముఖ్యఉద్దేశ్యం రైతుగా నిలబడటానికి శక్తి ఉండి కూడా పరపతి సౌకర్యాల కొరతవల్ల ఇబ్బంది పడే రైతులకు పరపతి సౌకర్యాలు కల్పించి ఆదుకోవటం. ప్రభుత్వం యిచ్చే సహాయాన్ని నిర్దిష్టమైన పనులకోసం పెట్టుబడి పెట్టి వీరు కృషిచేసి క్రొత్తకాలానికి తమ కాళ్ళ మీద తాము నిలబడగలుగుతారు.

## 1977-78 బడ్జెటు అంచనాలు

"తాత్కాలిక బడ్జెటుతో పోల్చి చూసినపుడు, వ్యాపార పంటల మీద పన్ను రద్దుచేయడం వల్ల భూమి శిస్తులో వచ్చిన తరుగు రూ. 5 కోట్లు తీసివేసిన తరువాత కూడా, ఇప్పటి పూర్తి బడ్జెటులో రివిన్యూ ఆదాయంలో నికరంగా రూ. 5.73 కోట్లు అధిక్యత కనిపిస్తున్నది. కేంద్ర ప్రభుత్వపు పన్నులలో రాష్ట్రపు వాటా పెరగడమూ, కేంద్ర ప్రభుత్వపు పథకాల కోసం కేంద్ర ఆర్థిక సహాయమూ దీనికి ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు.

"తాత్కాలిక బడ్జెటులో చూపిన విధంగా కాక యిప్పటి బడ్జెటులో రివిన్యూ ఖర్చులో నికరంగా రూ. 10.85 కోట్లు ఎక్కువ కనిపిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వ పథకాల క్రింద రూ. 73.36 లక్షలు, కేంద్ర ప్రభుత్వ పథకాలక్రింద రూ. 4.47 కోట్లు అదనపు ఖర్చు కావటమే కాక ప్రణాళికేతర అంశాలకోసం రూ. 5.61 కోట్లు అదనపు ఖర్చుకూడా యిందుకు కారణం.

"గడిచిన సంవత్సరం సవరించిన అంచనాల ప్రకారం రివిన్యూ ఆదాయం రూ. 688.07 కోట్లు. ఈ సంవత్సరపు రివిన్యూ ఆదాయం రూ. 769.99 కోట్లు ఉంటుందని అంచనా. పన్నుల వసూళ్ల పద్దు క్రింద వచ్చే ఆదాయమే ఈ యేడు రూ. 421.83 కోట్లు ఉంటుంది. సవరించిన అంచనాలలో ఇది రూ. 367.67 కోట్లు.

"ఈ యేటి బడ్జెటు అంచనాల ప్రకారం రివిన్యూ ఖర్చు రూ.708.40 కోట్లు. 1976-77 సవరించిన అంచనాలలో ఇది రూ. 639.64 కోట్లు. ఈ సంవత్సరం ప్రణాళికలో రివిన్యూ ఖర్చు గత సంవత్సరపు సవరించిన అంచనాల కంటే రూ. 14 కోట్లు ఎక్కువ అయింది. అంతేకాక లోగడ పేర్కొన్న వివిధ అంశాల క్రింద ప్రణాళికేతర బడ్జెటులో అధికంగా కేటాయింపులు జరిగాయి.

"1976-77 సవరించిన అంచనాల ప్రకారం పెట్టుబడి ఖాతా క్రింద ఖర్చు రూ.163.90 కోట్లు. అది ఈ యేటి అంచనా ప్రకారం రూ. 211.88 కోట్లకు పెరిగింది. ఈ పెరుగుదల ముఖ్యంగా రాష్ట్ర ప్రణాళిక మీద పెట్టుబడి, కేంద్ర పథకాల క్రింద ఖర్చు పెరిగినందు వల్ల సంభవించింది.

"పైన పేర్కొన్న వివిధఅంశాల ఫలితంగా ఈసంవత్సరం రూ. 61.86 కోట్ల లోటుతో ముగుస్తుందని అంచనా వేయబడింది. రివిన్యూలు, బకాయిలు బాగా వసూలు చేసుకోవడం ద్వారానూ, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయం పెరుగుదల ద్వారానూ, రిజర్వు నిధులనుండి తీసుకోవటం ద్వారాను ఈ లోటును భర్తీచేసికోవచ్చని ఆశిస్తున్నాము."

ఆది హిందూ సోషల్ సర్వీస్ లీగ్

# న్యాయపంచాయతీల వ్యవస్థ

— శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

హైదరాబాదులో హరిజనోద్ధరణ ఉద్యమానికి ఆది హిందూ సాంఘిక సేవా సంఘం (ఆది హిందూ సోషల్ సర్వీస్ లీగ్) స్థాపనతో అంకురార్పణ జరిగిందనవచ్చు. ఈ సంస్థను స్థాపించినవారు శివశ్రేష్ఠి మా. వెం. భాగ్యరెడ్డిగారు. వీరు హరిజనులు. హరిజనోద్ధరణ సర్వతోముఖమైంది. ఆనాటి పెద్దలనేకులు ఉద్యమాభివృద్ధికి ఇతోధికంగా చేయూత నిచ్చినారు. ఆ నాటి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి రాయ్ బాల్ముకుంద్‌గారు అధ్యక్షులుగా ఉండేవారు. ధర్మవీర వామన్నాయక్, రాజా ధనరాజ్ గిర్జీలాల్‌జీ మేఘజీవంటి సంపన్నులతోబాటు, న్యాయమూర్తి కేశవ రావు, ఆంధ్ర పితామహ మాడపాటి, "విక్టోరియల్ హైదరాబాదు" సంపాదకులు కృష్ణస్వామి, "ముదిరాజ్" బొజ్జ నర్సింలు వంటి నాయకులు కార్యవర్గంలో ఉండేవారు. భాగ్యరెడ్డిగారు కార్యదర్శిగా ఆది హిందువుల అభ్యున్నతికి బహుముఖ సేవ జరిగింది. ఇక్కడ వారు చేసిన న్యాయ వ్యవస్థను గూర్చి ప్రస్తావించటం జరుగుతుంది.

## తగాదాలు కోకొల్లలు

సాంఘికంగా అట్టడుగునపడి వున్న వారు కాబట్టి, నిమ్న జాతీయుల్లో, వారి కుటుంబ వ్యవహారాలకు, సాంసారిక జీవితాలకు సంబంధించిన చిల్లర తగాదాలు కోకొల్లలుగా వుండేవి. ప్రతి పల్లెలో వున్నట్టే హైదరాబాదు సికిందరాబాదు జంట నగరాలలోని ప్రతి బస్తీలో కులసంఘాలుండేవి. కుల పెద్దలు తమ అనుకూలాన్ని బట్టి, అప్పుడప్పుడు ఏ పోచమ్మగుడివద్దనో, మైసమ్మ గుడివద్దనో, ఊరిబైట ఏ మర్రిచెట్టు కిందనో కొలువుతీరి, తగాదాలు తెంపటానికి కూర్చుండేవారు. ఆలి ఆదుకోవటం లేదనో, మగడు ఏలుకోవటం లేదనో, కోడలు కొంపెరిచెదనో, అత్త గయ్యాళిదనో, మారుమనుము చేసికుంటామనో, విడాకులిస్తామనో—ఇంకా ఇటువంటి అనేక చీకటి తప్పులు, సందేహాస్పదపువర్తనలు పరిష్కారం కొరకు వచ్చేవి. మొదలే మాన మర్యాదలు దిగజారిపోయిన వారంటే, కులస్థులు కూడిన మహాజనసభలో ఒకరి మీదొకరు దుమ్మెత్తిపోస్తూ మరీ చులకనై పోయేవారు. పోనీ ఇంతకూ న్యాయం చేకూర్తుందా అంటే అదీ లేదు. కల్లుకుండలతో ఎవరెక్కువ జల్సా చేస్తే వారి వైపే మొగ్గు. ఈ రచ్చబండ వ్యవహారం పెచ్చు పెరిగిపోతూ, చీడపురుగువలె సంఘాన్ని తొలిచేస్తూ వుండటం చూడలేక పోయినాడు భాగ్యరెడ్డి. అయితే రాత్రి పాఠశాలలు పెట్టటం, పఠనాలయాలు నడుపటం వంటిదిగాదు న్యాయవ్యవస్థ చేయటం. అది చాలా క్లిష్టమైందేకాక బరువు బాధ్యతలతో కూడుకున్నది. అయినా సాహసించి కార్యోన్ముఖుడైనాడు.

## అమావాస్యకూ పున్నమికీ సమావేశం

ఒక్కొక్క బస్తీ తిరిగి నిజాయితీ పరులైన అయిదుగురిని కులస్థుల సమ్మతంతో పంచ్‌లుగా ఎంపిక చేసినారు. దానికి "న్యాయ పంచాయతీ" అని నామకరణం చేసినారు. నిర్ణీత సమయాల్లో—ప్రతి అమావాస్య పున్నమకు సమావేశం కావాలని నిర్ణయించినారు. సమావేశాలప్పుడు కల్లుకుండలుగాని, సారాసీసాలు గాని—చివరకు సోడా బుడ్లు గూడ తేగూడదని గట్టిగా నిషేధించినారు. నిషాలో న్యాయం జరుగదని నిర్మొహమాటంగా చెప్పినారు. న్యాయ పంచాయతీలు సమావేశమైనప్పుడు గంభీరమైన వాతావరణ ముండాలనీ, సర్కారీ అదాలత్ కచేరీ (కోర్టు) లలోవలె వ్యవహారం నడవాలని ఆదేశించారు. అందుకు అవసరమైన శిక్షణ అక్కడక్కడ ఇయ్యడం జరిగింది. వాది ప్రతివాదులు తమ తమ వాఙ్మూలాలు ఇచ్చే టప్పుడు గాని, గోల చేయక, ఒక్కొక్కరే నిదానంగా చెప్పుకోవటం ఆవేశ కావేషాలకు లోను గాక, బూతులు తిట్టుకోక సభా మర్యాద కాపాడాలని హెచ్చరించినారు. కొన్నాళ్ళలోనే ఆ వాతావరణం కలిగింది. "పంచముఖ పరమేశ్వర" అనే గౌరవ భావం కుదిరింది.

ఈ న్యాయ వ్యవస్థను ఇంకా క్రమబద్ధం చేయాలనే ఉద్దేశంతో, కేంద్రకార్యాలయంలో, అర్జీపత్రాలు, తలాబా రుసుం అదాలత్ టికట్లు అచ్చు వేయించి విక్రయించేవారు. ఏ బస్తీలోని న్యాయ పంచాయతీలో నైనా చాదర్ ఘాట్‌లో వున్న కేంద్ర కార్యాలయం నుండే, పత్రాలు టికట్లు (స్టాంపులు) కొని వాడవలసి వుండేది. ఇక ప్రతి న్యాయ పంచాయతీ, తమ ముందు విచారణ కొరకు వచ్చిన అభియోగాన్ని నమోదు చేసికొని, సంఖ్యా క్రమంగా విచారించి, తాము చేసిన తీర్పును రిజిష్టరులో నమోదు చేయటం కూడా జరిగేది. అపరాధ శుల్కాలు (జులానా) గూడా విధించడం జరిగేది.

అయితే అట్టి శుల్కం, బస్తీ న్యాయపంచాయతీలుగాక, కేంద్ర కార్యాలయంలో, కోశాధికారికి చెల్లించి, బాజాప్తా రశీదు తీసికోవాలనే నియమం గూడా వుండేది.

## తీర్పుమీద అప్పీలు

ఇది ఇంతటితో ఆగలేదు. బస్తీ న్యాయపంచాయతీలో న్యాయం జరగలేదని, వాది, ప్రతివాదులలో ఎవరైనా భావించవచ్చు. కాబట్టి అదే తుది తీర్పు అని, సంఘములమీద రుద్దటం

(తరువాయి 9 వ పేజీలో)

# వయోజన విద్యావశ్యకత

— 'పుష్యమి'

గాలి నీరు, ఆహారం, మనిషికి ఎంత అవసరమో, విద్య కూడా అంతే అవసరం. అది మానవుని ఆరవ ప్రాణం అన్నా తప్పు లేదు. మనిషి జీవితాన్ని తీర్చి దిద్ది, అతని జీవిత గమనానికి క్రొత్త ఊపిరినిస్తుంది విద్య.

ప్రస్తుత నవ సమాజంలో భాగస్వామిగా, మారుతున్న ప్రపంచ విషయాలను అవగాహన చేసుకుని, ఉత్పన్నమయే జాతీయ సమస్యలను ఆకళింపు చేసుకుని, దేశ కాల పరిస్థితులకు అనుగుణంగా, దేశ ప్రగతికై కృషిచేసే బాధ్యతగల పౌరుడుగా ఉండాలంటే ప్రతి వ్యక్తీ విద్యావంతుడు అయి తీరాలి.

ప్రజా స్వామ్య వ్యవస్థలో ప్రతి వ్యక్తికీ, అతని చర్యకు విలువ ఉంది. మన పరిపాలకులను మనమే ఎన్నుకొనవలసిన ప్రజా స్వామ్య వ్యవస్థలో వ్యక్తి విద్యావంతు డెతే చక్కగా ఆలోచించి, తన ఓటు హక్కు విలువ నెరిగి, సరైన ఉత్తముణ్ణి ఎన్నుకుని దేశ పాలనకు మంచి అండగా నిలవ గలుగుతాడు. అందుకు ప్రతి వ్యక్తీ చదువుకు తీరాలి. కనీసం చదవను, వ్రాయను నేర్చినా వార్తా పత్రికల ద్వారా ప్రతి రోజూ దేశం లోపల వెలుపలా జరిగే కార్యకలాపాల గూర్చి తెలుసుకోగలుగుతాడు.

అంతేకాదు, చదువుకున్న ప్రతి వ్యక్తీ తన సంతానాన్ని తానే తీర్చి దిద్దుకోను శ్రద్ధ వహిస్తాడు.

స్వాతంత్ర్యం వచ్చే నాటికి మన దేశంలో విద్యావంతుల సంఖ్య చాలా తక్కువ. వారి సంఖ్య అప్పటికి 12% మాత్రమే. 1947లో దేశంలో విద్యా సంస్థలు 2,20,000 మాత్రమే. 1965-66 సంవత్సరం నాటికి దేశంలో విద్యా సంస్థల సంఖ్య 7 లక్షల వరకూ పెరిగింది.

1947లో విద్యార్థుల సంఖ్య 180 లక్షలు కాగా 65-66 నాటికి 689 లక్షలకు పెరిగింది.

ప్రాథమిక పాఠశాలలు 150 లక్షల నుంచి 65-66 నాటికి 568 లక్షలకు పెరిగింది.

సెకండరీ పాఠశాలల విద్యార్థుల సంఖ్య 1947లో 30 లక్షలు కాగా, 65-66లో 258 లక్షలకు పెరిగింది. కాలేజీ విద్యార్థుల సంఖ్య 1947 లో $2\frac{1}{2}$ లక్షలు. 65-66లో 20 లక్షలకు పెరిగింది.

విద్యకై చేసే ఖర్చు 1948 నాటికి రూ60 కోట్లు. 1965-66 నాటికి ఆ ఖర్చు రూ600 కోట్లకు పెరిగింది.

పై అంకెలు పరిశీలించినట్లైతే స్వాతంత్ర్యం రాగానే విద్య కొఱకు భారత ప్రభుత్వం ఎంత కృషి చేసిందో అర్థం అవుతుంది.

ప్రస్తుతం కొన్ని వందల కోట్ల రూపాయలు ఈ విద్యా రంగంపై వెచ్చిస్తూ దేశంలో ప్రతి వ్యక్తి విద్యావంతుడు కావాలని ప్రభుత్వం ఆశిస్తోంది.

అయితే పాఠశాలకు వెళ్ళి చదువుకో గలిగిన వాతావరణం, అవసరాలు ఉన్న వారికి మాత్రమే ప్రభుత్వం అందించే సౌకర్యం అందుతున్నది. సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడి, ఏదో ఒక వృత్తి చేపట్టనిదే కుటుంబం గడవని వారెందరో చదువుకునే వయసులో కూడా పాఠశాలలకు వెళ్ళ లేక పోతున్నారు. వ్యవసాయం ముఖ్య వృత్తిగాగల మన దేశంలో రైతులను విద్యావంతులను చేయాల్సిన అవసరం నేడెంతైనా ఉందన్నది నిర్వివాదాంశం. రసాయనిక ఎరువుల వాడకంలో మెళుకువలు, అధికోత్పత్తి



పాలకొల్లులో వయోజన విద్యా కేంద్రం

మార్గాలు అతడు తెలుసుకోవలసి ఉంది. అలాంటి వారిని విద్యావంతులను చేయటానికి "వయోజన విద్యా కేంద్రాలు" అధిక సంఖ్యలో స్థాపించబడాలి. ఈ కేంద్రాలు పట్టణాలతో పాటు గ్రామాలలో అధికంగా వెలియాలి. గ్రామాలు అధికంగా ఉన్న భారతదేశంలో గ్రామీణులు తమ విద్యావిజ్ఞానాలని పెంపు చేసుకోడానికి ఈ వయోజన విద్యా కేంద్రాలలో విరివిగా చేరి గ్రామాలను సుసంపన్నం చేసే కృషిలో భాగస్వాములు కావాలి.

ఈ పాఠశాలలు అలాటి వారికి వీలుగా రాత్రిపూట నడుపబడుతాయి. పుస్తకాలు, రేడియో, చలనచిత్రాలద్వారా విద్యాబోధన జరుగుతుంది. పగలు వివిధ వృత్తులలో ఉన్నవారు రాత్రిపూట ఈ పాఠశాలల ద్వారా విద్యావంతులు కావచ్చు.

రాష్ట్రంలో ఇటీవల జరిగిన 'విద్యావారోత్సవాల' సందర్భంలో 'వయోజన విద్యా కేంద్రాలు' ప్రారంభించబడినాయి. ఉపాధ్యాయులు పగలు పాఠశాలలో పనిచేసి, రాత్రి ఈ కేంద్రాలలో స్వచ్ఛంద విద్యా సేవ చేస్తున్నారు



పురపాలక బాలికల పాఠశాలలో మహిళలకు వయోజన విద్యాకేంద్రం

ఈ వయోజన విద్యా కేంద్రాలలో ప్రత్యేక ఉపాధ్యాయులను నియమించి, వారికి కొంతపారితోషికం ఏర్పాటు చేస్తే ఈ రాత్రి పాఠశాలలు సమర్థవంతంగానూ, అందరినీ ఆకర్షించే విధంగానూ నడుస్తాయి.

రాష్ట్రంలో ఉన్న నిరుద్యోగులైన ఉపాధ్యాయ పట్టభద్రులను గాని, విద్యారంగానికి విశిష్టమైన సేవచేసి పదవీ విరమణచేసిన అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులను గాని ఈ కేంద్రాల్లో బోధకులుగా నియమించాలి.

నిరక్షరాస్యతనిర్మూలన కృషిలో ఈ రాత్రిపాఠశాల పాత్ర గణనీయమైనది.

ఏ పథకమైనా ప్రజా సహకారం లేనిదే విజయవంతమై సత్ఫలితంచేకూరదు. కనుక, ప్రజలనుంచి ఈ ఉద్యమానికి సంపూర్ణ సహకారం లభించాలి. ప్రభుత్వం నిరక్షరాస్యత నిర్మూలనకు కంకణం కట్టుకున్నది కనుక ఈ సౌకర్యం నిరక్షరాస్యులందరూ సద్వినియోగం చేసుకుంటారని ఆశించవచ్చు.

పట్టుదల ఉంటే సాధించలేని పని ఉండదుకదా!

## న్యాయ పంచాయతీల వ్యవస్థ

(7 వ పేజీ తరువాయి)

న్యాయమనిపించుకోదుగదా! ప్రభుత్వంలో తాలూకా మొదలు హైకోర్టువరకు రెండు మూడు కోర్టులలో అప్పీలు చేసికునే అవకాశమున్నది అందుకని వీరు గూడా అటువంటి అవకాశం కల్పించినారు అదే సదర్ న్యాయపంచాయత్. బస్తీ న్యాయ పంచాయతీల మురాఫా (అప్పీలు) సదర్ పంచాయతీలో చేయవచ్చు. సదర్ న్యాయ పంచాయతీలో నల్గురు న్యాయమూర్తులు, ఒకరు ప్రధాన న్యాయమూర్తి ఉండేవారు. ఆ నల్గురు న్యాయమూర్తులలో ఇద్దరు తర్వాత మంత్రి పదవులనలంకరించినారు 1. శ్రీ అరిగె రామస్వామి గారు—వీరు 1934లో హరిజనులకు హైదరాబాదు పురపాలక సంఘంలో నిజాం ప్రభుత్వం కేటాయించిన ప్రత్యేక నియోజక వర్గ స్థానానికి ఎన్నికయినారు. అదిగాక, స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన మొదటి ప్రజాస్వామిక హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వంలో (బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రివర్గంలో) మంత్రిగా నియుక్తులైనారు 2. శ్రీ బి. ఎస్. వెంకటరావుగారు లాయక్ అలీ మంత్రివర్గంలో విద్యాశాఖ మంత్రిగా నియుక్తులైనారు. ఇక మూడోవారు కంఠం రాజయ్యగారు, నాల్గోవారు కర్రె రామస్వామి గారు సర్కారీ వకీలుగా పనిచేసేవారు.

### సమాంతరన్యాయవ్యవస్థ

ఈ న్యాయ పంచాయతీల వ్యవస్థ వలన, ఆనాటి హరిజనుల్లో ఒక కట్టుబాటు, సురక్షిత జీవనం అలవాటైంది. కల్లుకుండల మధ్య జరిగే తీర్పులు తూర్పార పట్టడంతో బోలు కొట్టుకపోయింది. గిల్లికజ్జాలు, గయ్యాళితనాలు, ఆఘాయిత్యాలు ఆగిపోయినవి. సంఘ జీవనంలో చాలావరకు ప్రశాంతత ఏర్పడ్డది. ఇది కొన్నేళ్లు నడిచింది. ఉండి ఉండి ఒకనాడు "రహబరెదక్కన్" అనే ఉర్దూ దిన పత్రిక విలేఖరి ఈ న్యాయ పంచాయతీల భోగట్టాను అందించాడు. ఆనాటి రహబరె దక్కనంటె ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ముఖ పత్రం. అదే ఈనాడు "రహనుమా ఎ దక్కన్"గా పునర్జన్మ ఎత్తింది. వార్త ప్రచురించటంతో ఆగక, రెండుమూడు సంపాదకీయాలు వరుసగా ప్రకటించింది. "మరెక్కడో కాదు, నగరంలోనే హైకోర్టు ఛాయల్లోనే ప్రత్యామ్నాయ న్యాయవ్యవస్థ జరగటం–సమాంతర ప్రభుత్వం నడపటమేనని," వ్యాఖ్యానిస్తూ సత్వర చర్య తీసికోవలసిందిగా నిజాం ప్రభుత్వాన్ని హెచ్చరించింది.

# తిరుమలాయపాలెం సమితిలో
# సస్య విప్లవం

— శ్రీ కొండమంచిలి హెన్రీ



ఖమ్మం తాలూకా తిరుమలాయపాలెం నాగార్జున గ్రామీణ బ్యాంకు గత నాలుగు మాసములలో, బలహీన వర్గాలకు ఆర్థికసహాయ కార్యక్రమం క్రింద మొత్తం రూ. 26 లక్షలు వ్యవసాయ, వ్యవసాయేతర రుణాల మంజూరు చేసి, యిప్పటివరకు రూ.15 లక్షలు పేదప్రజలకు చెల్లించింది. ఈ కార్యక్రమం క్రింద 560 సేద్యపుబావులు, 55 ఆయిల్ ఇంజన్లు మంజూరీ చేశారు. వ్యక్తిగత పూచీమీద, యిచ్చిన యీ పరపతి సౌకర్యం, తిరుమలాయపాలెం, పాతర్లపాడు మహమ్మదాపురం, తాళ్లచెరువు మొదలగు 18 గ్రామాలకు విస్తరింపచేశారు. తిరుమలాయపాలెం గ్రామంలో 70 సేద్యపుబావులు త్రవ్వటకు మూడున్నర లక్షల రూపాయలు మంజూరుచేయగా, పాతర్లపాడు గ్రామంలో 160 బావులు త్రవ్వటకు రూ. 6.44 లక్షలు రుణంగా యిచ్చారు. బలహీనవర్గాలకు చెందిన హరిజన, లంబాడీ, తదితర వెనుకబడిన కుటుంబముల వారికి, యీ రుణసౌకర్యం ఎంతో తోడ్పడింది. మారుమూల గ్రామాలకు పరపతి సౌకర్యం అందజేయవలెననే ఉద్దేశంతో కుగ్రామమైన తాళ్ళచెరువు గ్రామంలో 52 సేద్యపుబావులు త్రవ్వటకు రూ. 2.08 లక్షలు మంజూరు చేశారు. గడచిన ఏప్రిల్ మాసంలో 22న కొండాపురం గ్రామంలో 96 సేద్యపుబావుల భారీ కార్యక్రమానికి ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు. సన్నకారురైతుల అభివృద్ధి సంస్థ యీ భారీ కార్యక్రమాన్ని చేపట్టింది ఈ బావులు పూర్తి అయిన తరువాత, యీ ప్రాంతంలో సస్య విప్లవాన్ని సృష్టించుటలో దోహదమొనర్చగలవు.

---

# ఉదయగిరి నగిషీపనుల ప్రావీణ్యత

ఉదయగిరి పాలించిన ఆఖరినవాబు జనాబ్ అబ్బాస్ అలీ ఖాన్ చేతివృత్తులకు చాలా ప్రాముఖ్యత నిచ్చి ఆదరించేవాడు. ఉదయగిరి చుట్టూ కొండలతో అడవులతో నిండిఉన్నది. అవసరమయ్యే ముడిపదార్థములు ముఖ్యంగా కాలేక్ర, దేవదారు, పాలబరికి, జిడ్ చేకి వాగైరా అడవికొయ్యలతో నగిషీవస్తువులు— చేతికర్రలు, కప్పులు, సాసర్లు, చెంచాలు, ఫోర్కులు, కత్తులు, చిన్నపెట్టెలు, బొమ్మలు తయారుచేయడంలో ఇక్కడి మహమ్మదీయులు సిద్ధహస్తులు, అప్పట్లో

## శ్రీ ఎం. గోవిందయ్య

వందల కుటుంబాలు ఈ నగిషీపనులు చేసి జీవిస్తుండేవి. ఇప్పటికీ కొన్ని కుటుంబాలు ఈ కుటీరపరిశ్రమను చేపట్టి ఉన్నాయి.

నేటికీ విదేశాలలో మంచిగిరాకీ వున్న ఈ నగిషీ వస్తువులను మధ్య దళారీలు తక్కువ ధరకు కొని, విదేశాలకు ఎగుమతిచేసి లబ్ధి పొందుతున్నారు. మద్రాసు, బొంబాయి, ఢిల్లీ, హైద్రాబాదు ఎంపోరియంల ద్వారా విదేశాలకు ముఖ్యంగా అమెరికాకు ఎగుమతి అవుతున్నాయి

1951 నుండి నెలకు రూ 30-00 ఉపకారవేతనంతో 14 బృందాలకు శిక్షణ ఏర్పాట్లు చేయుచున్న మన ఇండస్ట్రీస్ అండ్ కామర్స్ శాఖను అభినందించాలి ఇంతవరకు 84 మంది శిక్షణ పొందినారు. శిక్షణ కాలం ఒక సంవత్సరం ఈ నగిషీ పనిలో సిద్ధహస్తుడైన షేక్ నాగూబాయ్ ఖాజామియా వయస్సు సుమారు 90 సం॥లు ఆయన కుటుంబ సభ్యులు ఈ పనిని చేస్తున్నారు శిక్షణ పొందిన బృందాలు ఈ పనిని చేపట్టలేకపోతున్నాయి కారణం గిట్టుబాటు లేనందున.

ఉదయగిరి నగిషీవస్తువులు కొండపల్లి నిర్మల్ వస్తువులకు తక్కువేమి కావు కాని అనాదరణతో అడుగున పడివున్నవి. ఈ కుటీరపరిశ్రమను పునరుద్ధరించుటకు ప్రభుత్వ చేయూత ఎంతేని అవసరం.

# మన నారీమణులు



నారీలోకపు భారీ ఉద్యమ చరిత్ర నొకసారి పర్యావలోకనం చేస్తే— యీ దేశంలో మహిళలకు—అందరూ అనుకునేటట్టు ఉట్టినే హక్కులూ, అంతస్థూ రాలేదన్న సత్యం ద్యోతకం అవుతుంది. ప్రాచీన కాలంనుంచి నిన్న మొన్నటి అంతర్జాతీయ మహిళా సంవత్సరం దాకా—మహిళాలోకం తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడం కోసం, తమ ఉనికిని తెలియజేయడం కోసం—అడుగడుగునా అవమానాలను అధిగమిస్తూ అడ్డంకులను తొలగించుకుంటూ—శ్రమిస్తూనే వున్నారు.

మన స్వాతంత్ర్య ఉద్యమంలో బాపూజీ భారత నారీలోకపు వెన్నుతట్టి 'సమాజంలో పురుషుని పక్క మీ స్థానాన్ని ఆక్రమించి ఉద్యమానికి వూపిరి పొయ్యండి' అంటూ హెచ్చరించడంతో— 'భారత స్త్రీలకి రాజ్యాంగం సర్వహక్కులనీ (కాగితం మీదే) యిచ్చి వేయడంతో,' యింకా మీకేం కావాలి అన్న ప్రశ్న అందరూ అడగడం—ఒక అలవాటై పోయింది. ఈ ప్రశ్న వెనుక హేళనా, హక్కులు అడిగేవారి పట్ల చులకన భావమూ గ్రహించలేనంత అమాయకులు కాదు—భారత నారీమణులు. తరతరాల 'అణగదొక్కి వేయబడినతనం' ఒక్క తరంలో నిర్మూలించడం ఎలా సాధ్యం కాదో—స్త్రీలలో యీ 'వెనుకబడినతనాన్ని' వ్యక్తిత్వం లేనితనాన్ని, రెండవ తరగతి పౌరులమేమో నన్న అనుమానాన్ని పోగొట్టాలంటే పదేపదే మన గత చరిత్రను తవ్వుకోవడమే కాదు—ముందుచూపు పెంచుకోవడం కూడా చాలా అవసరం.




## మహిళా సంవత్సరం

1975 సంవత్సరాన్ని అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా యునైటెడ్ నేషన్స్ నిర్ణయించడానికి కారణం— మహిళా ప్రతిపత్తి విషయాలపై ప్రపంచ రాజ్యాల దృష్టిని నిల్పడం కోసమే. మహిళల ప్రతిపత్తి, హక్కులు, బాధ్యతలు తెలియ చెప్పడం దాని ప్రధాన లక్ష్యం. ఈ సంవత్సరపు ముఖ్యోద్దేశాలు—మూడు. స్త్రీ పురుష సమానత్వం పెంపొందించడం, సాంఘిక జీవనంలో—ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరంగా మహిళలు తమ స్థానాన్ని ఆక్రమించుకొనే ప్రయత్నాలు పెంపొందించడం, ప్రపంచ శాంతి స్థాపనలోనే కాదు, అంతర్ రాజ్యాల శాంతియుత సంబంధ బాంధవ్యాలు పెంపొందించడంలో మహిళల ప్రయోజన

కరమైన పాత్ర గుర్తించడం—ముఖ్యమైన ఉద్దేశాలు.

మహిళా సంవత్సరం ప్రపంచం మొత్తం మీద కుతూహలాన్ని రేకెత్తించింది; ఉదాసీనతని తొలగించింది. అమలు పరచదగ్గ కార్యక్రమాలనీ రూపొందించింది, అనవసరపు ఊహాగానాలనూ రేకెత్తించింది. మహిళల ఐక్యశక్తిని గుర్తింప చేసింది; అనేక విధాలయిన—ఆదర్శాలనీ, ఆశయాలనీ చాటిస్తూ విభిన్నతనీ — రూపొందించింది; కొందరు మహిళా నాయకురాండ్రు 'విజయవంతమైనదని' గర్విస్తే యీ సంవత్సరాన్ని కొందరు గేలి చేసి—'శుద్ధ దండుగ' అని అనేయడం జరిగింది. ప్రప్రథమంగా ప్రపంచ మహిళా సభ యీ సంవత్సరంలో జరిగింది. ఒకరిని గురించి మరొకరు, ఒకరి స్థితిగతుల గురించి మరొకరి స్థితిగతులను—మహిళలు తెలుసుకొందుకీ సభ దోహదకారి అయింది. ఈ సమావేశం ప్రపంచ దేశాలు మొత్తం మీద చేసిన కృషికీ, యివి ప్రతిపాదించు కొన్న ఆదర్శాలకీ— ఒకరూపకల్పన అనడంలో సందేహం అక్కరలేదు. కాని ఒక్కటి అందరూ గ్రహించాలి. ఒక్క సంవత్సరంలో అన్నీ సాధించగలడం అన్నది అసంభవం. అలాగే యీ సంవత్సరంలో యీ ప్రయత్నాలకు స్వస్తి అన్నది కూడా అబద్ధం. నిజానికీ సంవత్సరాన్ని మహిళోద్యమ చరిత్రలో ఒక మైలురాయిగా మనం గుర్తించాలి.

ఎన్నో సంవత్సరాలుగా అక్కడక్కడ ఉద్యమకర్తలు సాగిస్తున్న మహాయజ్ఞానికీ, మహిళలు సర్వత్రా సంఘంలో పురుషునితో సమ ఉజ్జీగా నిలవాలని పడుతున్న తాపత్ర[illegible]ని[illegible] సంవత్సరం ఒక ముఖ్యమైన [illegible]నడం—సత్యం.

నిజానికీ సంవత్సరం—మనందరికీ కొత్త దృష్టిని ప్రసాదించింది. ఇన్నాళ్ళ—చరిత్ర, సంప్రదాయం, ప్రకృతి స్త్రీ కి కేటాయించిన పాత్రను కొత్త కోణం నుంచి చూసే అవకాశాన్ని కలుగ చేసింది. అంతే కాదు. ప్రపంచం మొత్తం మీద ఎక్కడైనా సరే మానవులందరూ సమానులేనన్న హృదయ పూర్వకమైన — నమ్మకాన్ని ఎలుగెత్తి చాటింది.

## హక్కులు'— సమానత్వం బొట్టు పెట్టి యివ్వరు

ఈ మైలురాయి గుర్తుగా పెట్టుకొని భారత మహిళోద్యమాన్ని వెనక్కి తిరిగి చూస్తే—యీ హక్కుల వెనుక, యీ ఆదర్శాల వెనుక ఎందరెందరి శక్తి సామర్థ్యాలు, పట్టుదల వున్నాయో మనం గ్రహించగలం. అంతేకాదు యితర దేశాలలోలా కాక పోయినా, మనం కూడా— పట్టుపట్టకుండా, పోరాడకుండా హక్కులూ సమానత్వం పళ్లెంలో పెట్టి అందించరన్న అపోహ తొలగిపోతుంది. అది తొలగి పోతే తప్పించి—మన ఉనికిపై మనకి గౌరవం, మన వ్యక్తిత్వంపై మన కొకరకం విలువ ఏర్పడవు.

పాశ్చాత్య దేశాలలో మహిళోద్యమం ప్రాథమికమైన కొన్ని సామాన్య హక్కుల కోసమో, గుర్తింపు కోసమో కాకుండా మన దేశంలో ఒక ప్రత్యేక లక్ష్యంతో ప్రారంభం అయిందని చెప్పుకోవచ్చు. విదేశాలలోలాగా ఇది తిరుగుబాటు కాదు. ఒక ఉద్యమం మాత్రమే నని చెప్పుకోవాలి ఈ ఉద్యమ ప్రధాన లక్ష్యం సంప్రదాయ బద్ధమైన ఆచారాలనీ, అలవాట్లనీ యీ వర్తమానానికి అనుగుణంగా రూపొందించడమే అని చెప్పుకోవచ్చును.

ఈ శతాబ్దపు తొలిరోజుల్లో ఆంగ్లేయ నాగరికత వల్ల ప్రాభావితం అయిన కొద్దిపాటి కుటుంబాలలో ఆంగ్ల విద్యాభ్యాసం, పద్ధతులు — పాదుకొనడం ప్రారంభం అయ్యాయి. ఇటువంటి కుటుంబాలలో — మగవారికీ — యింటి దగ్గర ఆడవారికీ మధ్య అగాధం ఏర్పడ్డం ప్రారంభం అయింది. భార్యల సంప్రదాయసిద్ధమైన 'అలవాట్లకి చదువుకొని పాశ్చాత్య నాగరికత అలవాటు చేసుకొన్న వారి భర్తలకీ మధ్య ఏర్పడిన ఈ వైరుధ్యం—అశాంతిని రేకెత్తించడంలో వింత ఏముంది? అనేక శతాబ్దాల తరబడి పాతుకుపోయిన సంప్రదాయాలు, ఆచారాలూ, అలవాట్లు సడలిపోయే సందర్భాలు ఏర్పడక తప్పలేదు.

అసాధారణమైన తమ వ్యక్తిత్వం చేత నైతేనేం, చైతన్యం కల వారివారి భర్తల చేత, తండ్రులచేత—పాశ్చాత్య విద్యాసౌరభాన్ని అలవరచుకొన్న కొందరు మహిళలు ఈ విద్యావ్యాప్తి విస్తృతంగా మహిళా లోకంలో జరగాలని కోరుతున్నారు అప్పుడే కొత్త చైతన్యంతో రూపు దిద్దుకొంటున్న సంఘంలో తామూ తెలివిగా మసల గల్గడం సంభవం అని భావించారు ఈ కొత్త కోర్కెకు దోహదం యిచ్చిన వ్యక్తి సరోజినీ నాయుడు. అప్పటికే అంతర్వాహింగా మహిళల ఆలోచనా పద్ధతులలో కంటికి తెలియని మార్పు తెస్తున్న అనీబిసెంట్, మార్గరెట్ కజిన్స్ వంటి పాశ్చాత్య వనితలు—కొత్త వూపిరి పోశారు ఇటువంటి చైతన్య వంతుల మూలాన్నే మనదేశంలో మహిళా ఉద్యమాలకి ప్రాణం వచ్చింది. ఊత ఏర్పడింది

1918 లో ఓటు హక్కు విషయాలు చర్చకు వచ్చేసరికి — చాలా మంది స్త్రీలు విద్యావంతులు కావడమే కాదు. కొత్త చైతన్యంతో కొత్త ఉత్సాహంతో ముందు కురకడానికి సిద్ధంగా వున్నారు. అందుకే తమకూ ఓటు హక్కు కావాలని అడగ కల్గారు. ఈ హక్కు ప్రతి పౌరునికీ 'యివ్వాలా వద్దా' అని చర్చలు జరపటానికి వచ్చిన— 'మాంటెగ్ చెమ్స్ ఫర్డ్ కమిటీ ఈ మహిళలని ఎదుర్కోక తప్పలేదు ! నిజానికీ కమిటీ సభ్యులు మహిళా ప్రతినిధులని కలుసుకోడానికూడా నిరాకరించారు.

## " స్త్రీ విద్యా " నినాదం

ఈశతాబ్దపు తొలి రోజుల్లో ఇంగ్లండులో నడచిన మహిళోద్యమాన్ని జాగ్రత్తగా పరిశీలించిన హిందూస్త్రీలు వారికి తమ సానుభూతి ప్రకటించడమే కాదు, విప్లవాత్మకమైన వారి దృక్పథం తమకి అవసరం లేదని గ్రహించారు. అందుకే మన దేశంలో హక్కుల పోరాటం—పెద్ద పోరాటం అనిపించలేదు. మనది తొలి నుంచీ 'వెయిట్—సీ' పద్ధతి, దానికి కారణం గాంధీ సత్యాగ్రహ పద్ధతి, సహాయ నిరాకరణ పద్ధతి— ఒప్పించి సంపాదించుకోవడం పద్ధతి— మన మహిళలకి బాగా అర్థం కావడం వల్ల— పోరాటంలో కాకుండా 'సాధించ'డమే ధ్యేయం అయింది. అందుకే—పురుషులకి ఓటు హక్కు

వచ్చిన కొద్ది మాసాల తేడాలో మనకీ ఓటు వచ్చింది. కాని ఈ హక్కు వినియోగించుకోగల అర్హతలు చాలా తక్కువ మంది స్త్రీలకి వుండడం గమనార్హం. అందుకే ఈ సమయంలో ఓ కొత్త నినాదం బయలుదేరింది. అదే "స్త్రీ విద్య" నినాదం. స్త్రీలు విద్యావంతులు కానిదే సంఘంలో రాణించలేరని గ్రహించి ఉద్యమ కర్తలు దేశం మొత్తం మీద స్త్రీ విద్యా నినాదాన్ని లేవనెత్తారు.




తరువాత ఓ దశాబ్దం పాటు స్త్రీ ఉద్యమ కర్తలు అలసటలేని పోరాటం జరిపి మహిళా లోకంలో కొత్త చైతన్యం తీసుకురాగలిగారు. ఈ చైతన్యం సరైన దారిని పట్టించాలన్న కుతూహలంతో మొట్టమొదటి మహిళా సమ్మేళనాన్ని ఏర్పాటు చేశారు. ఈ సమ్మేళనం అప్పట్లో స్త్రీ విద్యను చర్చించడమే ప్రధాన లక్ష్యంగా వుంచుకొంది. ఈ సమ్మేళనం ఫలితంగానే "ఆలిండియా ఉమెన్స్ కాన్ఫరెన్సు" రూపొందింది. స్త్రీ అవిద్య, పరదా, బాల్య వివాహాలు మొదలైన దురాచారాల నిర్మూలనానికి కృషి చేయడానికి సమ్మేళనం నడుం బిగించింది. ఈ సంప్రదాయ సిద్ధమైన కట్టుబాట్లను కాదని ముందుకు సాగాలంటే సంఘ సంస్కరణ విషయం కూడా తమ ప్రణాళికలో చేర్చుకోవడం అవసరం అని నిర్ణయించుకోడంలో ఆశ్చర్యం లేదు.

స్వాతంత్ర్య ఉద్యమం ముమ్మరం అవుతున్న కొద్దీ మహిళల దృక్పథంలో కూడా మార్పులు రావడం ప్రారంభించాయి. మన దేశంలోకి శ్రామికుల కష్టసుఖాలను పరిశీలించడానికి 1928 లో 'లేబర్ కమీషన్' వచ్చింది. మాంటెంగ్ నాటికీ యీనాటికీ వ్యత్యాసం ఎంతగా వచ్చిందో తెలుసుకొందుకు యీ ఒక్క విషయం చాలు. ఈ లేబర్ కమీషన్ – మహిళా సంస్థని సహకరించి ఆలోచన చెప్పమని కోరింది. మహిళలు ఐక్య కంఠంతో – సాధించ కల్గినదీ సందర్భంలో– లేబరు కమీషన్ వారి సిఫార్సులను అమలులోకి తీసుకొచ్చేలా చూడగల్గడం పరిశ్రమలలో స్త్రీల స్థితిగతులు మెరుగుపడడానికి– యీ సిఫార్సులు చాలా ముఖ్యమైనవి.

## శారదా చట్టం

బాల్య వివాహాలంటే ఈ రోజుల్లో మనకి ఆశ్చర్యంగా వుండవచ్చు. కాని ఆ రోజుల్లో పుట్టని పాపలకి పెళ్లిళ్లు చేసేవారంటే– అతిశయోక్తి కాదు. పచ్చి నిజం. ఇలాంటి దారుణాన్ని ప్రతిఘటించేదే – శారదా బిల్లు. కాని యింత సంస్కారవంతమైన చట్టం సనాతనుల ఆందోళనవల్లా, బ్రిటిష్‌వారి నిర్లక్ష్యం వల్లా మొదట పరాజయం పొందింది. కాని ధైర్యం చేసి మహిళలు, తమకు తోడుగా అభ్యుదయవాదులైన మగవారిని కూడగట్టుకుని – ఆందోళన ప్రారంభించి.... చివరికి తిరిగి శారదా బిల్లు చర్చకు వచ్చేదాకా వూరుకోలేదు. అందుకే ఈనాడు భారత మహిళ సగౌరవంగా తలెత్తుకు తిరుగుతోందంటే ఇందుకు కారణం స్త్రీలతోపాటు రాజా రామ్మోహన్‌రాయి వీరేశలింగం పంతులు వంటి ఉత్తమ సంస్కారం గల పురుషులు కూడా ఎంతో కారణం అని చెప్పుకోవాలి. ఏ ప్రభుత్వం ఏ ఒక్క మహిళా సంస్థ సాధించలేనంత సాధించారు వీరేశలింగంగారు తమ ఉద్యమం ద్వారా. చేతలుగాని, మాటలు అనవసర మని నిరూపించిన మహిళా జ్యోతి శ్రీ వీరేశలింగం పంతులుగారు.

భారతదేశంలో సంస్కరణోద్యమం పుంజుకోవడం గమనార్హం. అతి ఆందోళనాకరమైన యీ సమయంలో ప్రజలను చైతన్యపూరితులని చేయడమే కాదు. వెనుతిరిగి చూడకుండా ఉద్యమంలోకి ఉరికించిన ఏకైక వ్యక్తి; దరిద్ర నారాయణుడు మహాత్ముడు. స్త్రీలను ప్రత్యేకమైన పిలుపు నిచ్చి ఉత్తేజ పరిచాడు. మీరు కూడా పక్కన లేనిదే గెలుపు అసంభవమనే నమ్మకాన్ని స్త్రీలోకానికి కల్గించాడు. తను సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని దేశ సౌభాగ్యానికి దారి చూపడమే కాదు, దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో పాలొనడం ద్వారా–దానితో పాలు పంచుకోమని ఆదేశించాడు. సంప్రదాయపు సంకెళ్ళను తెంచి, అలవాట్ల పొరపాట్లు గట్టున పెట్టి–ఆత్మ వంచన లేకుండా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడానికి ముందుకురికిన మహిళలు–వేలకి వేలు. బాపూజీ అడిగినదే తడవుగా ఆభరణాలు ఒలిచి యిచ్చారు. విదేశవస్తువులు, బట్టలు విసర్జించి, దేశీయతకి అందలం పట్టారు. దేశం మొత్తం మీద ఊరేగింపులు జరిపారు. లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ల పాలయ్యారు. యీ సమయంలో – కడప రామ సుబ్బమ్మ కనుపర్తి వరలక్ష్మమ్మ, ద్రోణం రాజు లక్ష్మీబాయమ్మ, దుర్గాబాయి, అచ్చమాంబ లాంటి అనేక మంది–మహిళామణుల పేర్లు మన మనస్సులో కదలాడుతాయి. స్త్రీలలో ఏర్పడిన ఈ వ్యక్తిత్వపు స్థాయి శాశ్వతమై నిలిచిపోయింది. మానసికంగా మహిళలు చాలా ఎత్తుకి ఎదిగిపోయారు.



# గవర్నరు విశాఖ పర్యాటన

విశాఖపట్నం రేవుకార్మికుల సౌకర్యం కోసం నిర్మించిన విశ్రాంతి మండపానికి మే 25 వ తేదీన గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ శంకుస్థాపన చేశారు.





మే 24వ తేదీన విశాఖపట్టణం నౌకాశ్రయంలో "పోర్ట్ కాంప్లెక్స్" పర్యవేక్షించారు.





మే 29 న విశాఖపట్టణానికి సమీపంలో వున్న మువ్వలవారి పాలెంలో నగర ప్రణాళికా సంస్థ వారి ఆధ్వర్యంలో నిర్మాణంకానున్న గృహసముదాయానికి గవర్నరు శంకుస్థాపన చేశారు.





## నగరంలో

ఎడమ వైపున : ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయి మే 19 న ఢిల్లీ వెళుతూ బేగంపేట విమానాశ్రయంలో ఆగిన సందర్భంగా గవర్నరు, ముఖ్యమంత్రి ప్రభృతులు స్వాగతం చెప్పారు.

కుడివైపు పైన : ఇటీవల రాజభవన్‌లో గవర్నరు శ్రీమతి శారదా ముఖర్జీ ప్రముఖ వేద పండితులను సత్కరించారు.

ఎడమవైపున మధ్యన : మే 23 న కుశాయిగూడా లో ఉద్యోగినుల వసతి గృహానికి గవర్నరు శంకుస్థాపన చేశారు.

ఎడమవైపున క్రింద : హైదరాబాదులోని ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయంలోని షెడ్యూలు కులాలకు చెందిన ఉద్యోగస్తుల సంఘం వారు డా. అంబేడ్కర్ 86 జయంత్యుత్సవాలు నిర్వహించారు.

కుడివైపు క్రింద : ఆంధ్రప్రదేశ్ కో-ఆపరేటివ్ గజెటెడ్ ఉద్యోగుల సప్తమ వార్షికోత్సవసభ మే 29న హైదరాబాదులో జరిగింది.








# అశ్వారావుపేట సమితిలో గిరిజనాభివృద్ధి

ఖమ్మం జిల్లా అశ్వారావుపేట పంచాయతీ సమితి మొత్తం జనాభాలో 40 శాతం గిరిజనులు అందువలన కేంద్ర ప్రభుత్వం 1962 జూన్ నుండి ఆ సమితిని గిరిజనాభివృద్ధి సమితిగా పరిగణించింది

దాదాపు పదిహేను సంవత్సరాలకు పూర్వం కారడవులలో వాగుల ఒడున గూడేలలో కోయలయొక్క జీవితం కడు దుర్భరంగాను, శోచనీయంగాను ఉండేది

## రోజులు మారాయి

అది ఒకప్పటి మాట ప్రభుత్వం గిరిజనులకు నిర్దిష్టమైన సంక్షేమ కార్యక్రమాలు సమితులద్వారా, వివిధ శాఖలద్వారా చట్టంరూపేణా అమలుపరచటంతో వారి నవజీవనానికి నాంది పలికింది ఇపుడు వారు కోయలు కాదు. గిరిజనులు. సమితి ప్రాంతంలో ఎటు చూచినా ప్రతి 5 మైళ్ళకు ఏదో ఒక కార్యక్రమం గిరిజనులకై ప్రభుత్వం నిర్వహిస్తున్నది వారి భవితవ్యానికి అన్ని రంగాలకు సంబంధించిన పథకాలను సత్వరం అమలుపరచుటకు, అందుకు కేటాయింపబడిన నిధులు సద్వినియోగపరచుటకును గిరిజనులకు ప్రభుత్వ యంత్రాంగంలో ప్రాతినిధ్యం ఇవ్వబడింది అశ్వారావుపేట గిరిజన సమితిలో 10 మంది గ్రామపంచాయతీ సర్పంచ్‌లు ప్రాతినిధ్యం వహిస్తున్నారు

ప్రతి గిరిజనునకు వ్యవసాయానికి కావలసిన భూమి, ఇల్లు, ఇండ్ల స్థలాలు ఉచితంగా కేటాయించారు. గిరిజనులకు 6 గ్రామాలలో 156 కుటుంబాలవారికి ఇళ్ళు నిర్మించారు. గిరిజనులు భూములు కొనుటకుగాని అమ్ముటకుగాని వీలు లేకుండా ప్రభుత్వం చట్టాన్ని రూపొందించి వారి ఆస్తికి రక్షణ కల్పించింది

## ఉచితంగా ఆయిల్ ఇంజన్లు

వ్యవసాయమే ముఖ్య వృత్తిగాగల గిరిజనులకు వ్యవసాయ శాఖవారు 50 ప్రదర్శనా క్షేత్రాలను యేర్పాటుచేసి వారికి ఆధునిక వ్యవసాయ పద్ధతులలో శిక్షణ ఇచ్చారు. సమితిలోని 9,400 గిరిజన వ్యవసాయ కుటుంబాలవారికి 480 వ్యవసాయ బావుల సబ్సిడీమీద ఋణాలు ఇచ్చారు బావులద్వారా సేద్యం చేసికొను ఉత్సాహవంతులైన గిరిజన రైతులకు 23 ఆయిలు ఇంజన్లు ఉచితంగా ఇచ్చారు. నీటి వసతులను కల్పించే నిమిత్తం ఇంతవరకు 31 గొట్టపు బావులను నిర్మించి దాదాపు 1550 ఎకరాలను సేద్యంలోకి తెచ్చుటకు యేర్పాట్లు జరుగుతున్నాయి. విద్యుచ్ఛక్తి మోటార్లద్వారా సేద్యం చేసే నిమిత్తం అంకంపాలెంలో ప్రభుత్వం ఒక విద్యుచ్ఛక్తి ఉప కేంద్రాన్ని స్థాపించింది. ఈ కేంద్రం కేవలం వ్యవసాయానికే పరిమితంగాక గిరిజన ప్రాంతంలో పరిశ్రమలను నెలకొల్పి గిరిజన యువకులకు ఉద్యోగావకాశాలు కల్పిస్తుంది. 25 వేల ఎకరాల భూమిని సాగులోకి తీసికొనివచ్చుటకుగాను ప్రభుత్వం రు. 3 60 కోట్లతో గొల్లగూడెం చెరువు, పెదవాగు ప్రాజెక్టు చేపట్టింది.

గిరిజన బాలురను భావిపౌరులుగా తీర్చిదిద్దుటకుగాను సాంద్ర విద్యా పథకాలకు, ప్రత్యేక పౌష్టికాహార కేంద్రాలకు గిరిజనాభివృద్ధి సంస్థ ప్రతి సంవత్సరం 4 లక్షల రూపాయలను వినియోగిస్తున్నది. ఈ సమితిలో 7 ఆశ్రమ పాఠశాలలు 3 గిరిజన వసతి గృహాలలో 470 మంది గిరిజన బాలురకు ఉచిత విద్య, భోజన, వసతి సౌకర్యాలు కల్పించబడినవి. ఇవిగాక 45 కేంద్రాలలో 5 సంవత్సరములలోపు వున్న 2800 మంది పిల్లలకు పౌష్టికాహారం ఇవ్వబడుతోంది. ఈ బాలల ఆరోగ్య విషయంలో ఎప్పటికప్పుడు వైద్యాధికారులు పరిశీలన జరిపి తగిన చర్య గైకొనటంవలన వ్యాధులను నివారించటమేగాక మరణాల సంఖ్యకూడా తగ్గించబడింది.

## కనిపిస్తున్న మార్పు

గిరిజన ప్రాంతాలలో నిర్మించిన రహదారుల సౌకర్యంవలన గిరిజనులకు బాహ్యప్రపంచంతో రాకపోకల సంబంధాలు యేర్పడి వారి ఆచార వ్యవహారాలలో ఎంతో మార్పు కొట్టవచ్చినట్లు కన్పిస్తూంది.

ఆటవీ సంపద సమృద్ధిగా లభించు ఈ ప్రాంతంలో గిరిజనులు ముషిగింజలు, తేనె, చీపుళ్ళు, వి సరాకు కట్టలు, మొదలగు సరుకులను మధ్య దళారీలకు అమ్మి నష్టపోకుండా గిరిజన సహకార శాఖలలో సరసమైన ధరలకు అమ్మి తమకు కావలసిన నిత్యావసర వస్తువులను కంట్రోలు ధరలకు పొందగలుగుతున్నారు. ప్రస్తుతం గిరిజన ప్రాంతంలో 13 గిరిజన సహకార సంఘ శాఖలు నెలకొల్పబడ్డాయి.

ఈ విధంగా అన్ని రంగాలలో ముందడుగు వేస్తున్న గిరిజనులు, సాంఘికంగా, ఆర్థికంగా, మిగిలిన వర్గాలవారితో సామీప్యాన్ని పొందుతున్నారు వారికి గడచిన రోజులు చీకటి రాత్రిలో ఒక పీడకల భవిష్యత్తు ఒక పగటి వెలుగు

శ్రీ డి. వి. ఎన్ అప్పారావు

# గ్రామీణార్థికాభ్యుదయంలో పారిశ్రామిక పురోగతి

విస్తారంగావున్న గ్రామీణ ప్రాంతాల సమగ్రాభ్యుదయమే దేశాభ్యుదయమని మహాత్మాగాంధీ వంటి పెద్దల ప్రవచనం. పల్లె ప్రజలకు ఉపాధిసౌకర్యాలు కల్పించటానికీ, జనబాహుళ్యానికి పారిశ్రామికాభివృద్ధి ఫలితాలనందుబాటు లోకి తేవడానికీ ప్రభుత్వం ప్రత్యేక పథకం రూపొందించింది. మొదట్లో ఈ పథకంలో చేరేందుకు దేశం మొత్తంమీద 111 జిల్లాల నెన్నిక చేశారు. గ్రామాలలో పారిశ్రామిక ప్రాజెక్టుల కార్యక్రమం 1962-63 సం॥లో తొలిసారిగా ప్రారంభింపబడి యీ జిల్లాలలో విశేషంగా అమలు జరుగుతోంది. ఇంతకు ముందుగానే పరిశ్రమలు స్థాపించినవారు తమ పరిశ్రమల విస్తరణకూ నూతన పారిశ్రామిక వేత్తలు క్రొత్తగా చిన్నతరహా పరిశ్రమలు నెలకొల్పటానికీ ప్రత్యేక సదుపాయాలు కల్పించేటందుకు విస్తృత ప్రాతిపదికపై బృహత్ కార్యక్రమం రూపొందించారు. ఒక్కొక్క ప్రాజెక్టుకు ఒక్కొక్క అధికారిని నియమించారు. సాంకేతిక, ఆర్థిక విస్తరణ సిబ్బందితో గూడిన బృందాలు ఆయనకు తోడ్పడుతుంటాయి.

వీరు క్రొత్తగా పరిశ్రమలు స్థాపించేవారికి ఉత్పత్తి, సాంకేతిక పద్ధతులు సాంకేతిక విస్తరణ సేవా సదుపాయాల విషయంలో అమూల్యమైన సహకారం యిచ్చారు. వారికి కావల్సిన ముడి సరుకులు సంపాదించి పెట్టటంలోను, వివిధ సదుపాయాల కల్పనలోను యెంతగానో తోడ్పడారు. ప్రాజెక్టు వ్యవస్థకయ్యే ఖర్చు మొత్తం పూర్తిగా భారత ప్రభుత్వమే భరిస్తున్నది. తక్కువ వడ్డీకి అనగా 5½ శాతంతో రుణాలు కూడ పారిశ్రామిక వేత్తలకు మంజూరు చేశారు. ఇంజనీర్లు అయిన పారిశ్రామిక వేత్తలకు వేరొక పథకం క్రింద రుణాల నిచ్చి వడ్డీ మరికొంత తగ్గించారు. ఈ అప్పును సులభ వాయిదాలలో తీర్చుకునే సౌకర్యం కల్పించారు. చిన్న తరహా పరిశ్రమలకు, ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో పరిశ్రమలకు ప్రయోజనం కల్గించేటందుకు భారత దేశ ప్రభుత్వం మరో కార్యక్రమం ప్రారంభించింది. ఈ పరిశ్రమల స్థాపకులు సాంకేతిక సేవా సహకారాల విషయాలలో సలహా సంప్రదింపులు జరిపేందుకీ కార్యక్రమం రూపొందించబడింది. ఇందుకు గాను వసూలు చేసే రుసుము వెనుక బడ్డ ప్రాంతాలలోని పారిశ్రామికులు చెల్లించనక్కరలేదు. ఆ ఖర్చు ప్రభుత్వమే భరిస్తుంది. ఇతర ప్రాంతాలలో స్థాపితమయ్యే పరిశ్రమల విషయంలో కూడా యీ రుసుమును మన ప్రభుత్వమే 25 శాతంవరకు భరిస్తుంది. దేశంలోని వివిధప్రాంతాలలో యేర్పాటయిన చిన్నతరహా పరిశ్రమల సేవాసంస్థల ద్వారా ఈ కార్యక్రమం నిర్వహింపబడుతోంది.

గ్రామ ప్రాంతాల్లోని వృత్తి పనివారికి సహాయం చెయ్యటానికి భారత ప్రభుత్వం మరో పథకం అమలు జరిపింది. వారు అనాదిగా అవలంబిస్తున్న వృత్తి విద్యలో నైపుణ్యం పెంపొందింపచేయటానికి, వారికి ఆ విద్యలలో శిక్షణ సౌకర్యాల నేర్పరచారు. ఇందు మూలంగా వారి ఆదాయం పెరిగింది. మేలు రకం పనిముట్లు వారికి సరఫరా చేయబడ్డాయి. వాటి ధరల్లో మూడవ వంతు మాత్రమే వారు చెల్లించాలి. అలా తక్కువధరలో వాటిని కొనుక్కోవటానికి ఆ వృత్తిదారులకు బ్యాంకులు రుణాల నిచ్చాయి. ఈ పథకం ఫలితంగా గ్రామ ప్రాంతాలలో ఆయా వస్తువుల ఉత్పత్తి పెరిగింది. వృత్తి పనివారి ఆర్థిక పరిస్థితి మెరుగు పడింది. ఈ కార్యక్రమం దేశం మొత్తం మీద 40 జిల్లాలలో యిప్పటికీ అమలులో వుంది.

ఇంతేగాక వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర పాలిత ప్రాంతాల అధికారులు కూడ ఈ పారిశ్రామికాభివృద్ధి ప్రాజెక్టుల నిమిత్తం ప్రత్యేక సౌకర్యాలు, రాయితీలు ప్రకటించి, ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. ఈ పారిశ్రామికాభివృద్ధి కృషిలో సహకార సంఘాలు కూడ విశిష్టమైన కృషి చేస్తూ, పంపిణీ విధానాన్ని క్రమబద్ధం చేస్తున్నవి. ఈనాడు మన దేశంలో 3లక్షల, 40 వేల సహకార సంఘాలున్నాయి. వీటిలో 7 కోట్ల, 30 లక్షల మంది సభ్యులున్నారు. కేవలం గ్రామీణ ప్రాంతాలలోనే సహకార సంఘాలు 47 వేల వినియోగదార్ల స్టోర్లను నిర్వహిస్తున్నాయి.

కంట్రోలు వస్త్రం అమ్మకాన్ని 46 వేల సహకార సంఘాలు సమర్థవంతంగా నిర్వహించాయి. వీటిలో 80 శాతం గ్రామీణ ప్రాంతాల స్టోర్లు కావటం గమనార్హం.

ఈ రీతిగా ఉత్పత్తి, పంపిణీ అనే రెండు అంశాలను చేపట్టి పారిశ్రామికాభివృద్ధి ప్రాజెక్టు,సహకార సంఘాలు సమానాంతరంగా కృషి చేస్తున్నాయి.

—"సుచంద్ర"

# ప్రయాణీకుల సేవలో ఆంధ్ర ప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ

మానవుడు సంఘజీవి. అనాదినుంచీ కూడా మానవుడు—సాగుతున్న సాంఘిక పరిస్థితులకు అనుగుణంగా తన జీవితాన్ని మలచుకుంటూ పురోగమిస్తున్నాడు. ఆదిలో మానవుని ప్రయాణం కాలినడకపై సాగించే వాడు. కొన్నాళ్ళకు పాదయాత్రకు స్వస్తి చెప్పాడు. జంతువులను మచ్చిక చేసుకొని వాటిని వాహనాలుగా ఉపయోగించు కున్నాడు. గుర్రాలను, ఎద్దులను, దున్నలను కూడా బళ్ళను ఈడ్చడానికి వినియోగించాడు.



కాలక్రమేణా శాస్త్ర విజ్ఞానం మానవ జీవితంలో చోటు చేసుకొంది. విజ్ఞానం ప్రభావంవల్ల ప్రపంచం రూపురేఖలు మారి పోయి గుర్తు పట్టలేనంతగా మారిపోతు న్నది. మానవుడు కూడా ముందుకు పోతున్న సమాజం వేగంతో పాటు తన గమన వేగాన్ని పెంచాడు. ప్రయాణం చేయటానికి వేగంగా కదిలే

శ్రీ సిద్ధాని నాగభూషణం

వాహనాలు అవసరం అయ్యాయి. ఇలా వేగంగాపోయే వాహనంగా సైకిలు అవ తరించింది. అది మానవ జీవిత వేగాన్ని పెంచింది. తర్వాత మోటారుసైకిలు, దానితోపాటు బస్సులు పోటీపడుతూ చక చకా పయనం చేయటానికి మనిషికి తోడ్ప డ్డాయి.

ఇంకా వేగంగాపోయే వాహనాలు కూడా మానవ వికాసానికి దోహదం చేశాయి. శాస్త్రవిజ్ఞాన ప్రగతి ఫలితంగా వచ్చిన వాహనాలైన రైలులోనూ విమానంలోనూ తన గమ్యాన్ని అనతికాలంలో చేరుకుంటు న్నాడు.

విమానం, రైలు వేగాలు ఎక్కువే అయినా వాటిలో అన్ని రూట్లకు వెళ్ళడానికి వీలుండదు. వాటి నిర్వహణకు అవి పోయే మార్గాలు నిర్వహించటం చాలా ఖర్చుతో కూడిన పని. రైలు మార్గాన్ని వేయడం కూడా కష్టంతో కూడిన పనే. అయితే బస్సులు మారుమూల ప్రాంతాలకు వెడ తాయి. ఖర్చు తక్కువ కూడా. వేగంగా వెళ్ళే రైలుకు వాయువేగంతో పోటీపడుతూ వెళ్ళే విమానానికి ఆధునిక శాస్త్ర యుగంలో అత్యంత ప్రాముఖ్యం ఉన్నప్పటికీ, బస్సులు నిర్వహించే పాత్రను సామాన్య మానవుడు విస్మరించ లేదు. ప్రస్తుతం అవి సమాజంలో కీలకమైన పాత్ర వహిస్తు న్నాయి. అద్యతనభావిలో కూడా వాటికి ప్రముఖ స్థానం ఉంది.

రోడ్డు రవాణా సంస్థ ఛైర్మన్
శ్రీ పి. నరసింగరావు



మొదట్లో బస్సుల నిర్వహణవ్యక్తులచేతుల్లో వ్యక్తులు కలిసిన సంస్థల చేతుల్లో ఉండేది. అయితే ఆ నిర్వహణ ప్రయాణీకులకు ఎక్కువగా తోడ్పడలేదు. ప్రయాణీకుల సౌకర్యాలు కల్పించటానికి వ్యక్తులు అంత గా పట్టించుకోలేదు. బస్సు నడిపే డ్రైవరు, కండక్టర్ల దయాదాక్షిణ్యాల మీద ఆ బస్సు వేగం, గమ్యానికి చేరే సమయం ఆధారపడి ఉండేవి. లోపభూయిష్టమై అరిష్టదాయకమైన విధానానికి స్వస్తివాక్యం పలకడానికి బస్సుల నిర్వహణ బాధ్యతను ఆనాడు పాలకులు చేపట్టారు. దాని పర్యవసానమే రోడ్డు రవాణా సంస్థ అవతరణ.

1932 వ సంవత్సరంలో 27 బస్సులతో రోడు రవాణా సంస్థ రైల్వేల విభాగంగా ప్రారంభమయింది. అప్పట్లో ఒక్కొక్క బస్సులో 24 మంది ప్రయాణం చేయటానికి వీలయ్యేది. 1960 వ సంవత్సరంలో నిజాం

రైల్వే విభాగాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకొనే నాటికి బస్సుల నిర్వహణ బాధ్యత తను రోడ్డు రవాణాశాఖకు వప్పజెప్పింది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడేనాటికి ఈ రోడ్డు రవాణా సంస్థ ఎక్కువ బస్సులను వేసి ప్రయాణీకులను చేరవేస్తుండేది. అప్పట్లో ఈ రోడ్డు రవాణా సంస్థ పరిధి తెలంగాణా జిల్లాలు, వరంగల్, కొత్తగూడెం మునిసిపాలిటీలు మాత్రమే.

ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు కలిసి సమైక్య ఆంధ్ర ప్రదేశ్‌గా ఏర్పడిన తర్వాత ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ దృష్టికి ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో ప్రయివేటు బస్సునిర్వాహకులు చేస్తున్న అన్యాయాలు, అక్రమాలు వచ్చాయి. వీటి నివారణకు ప్రజలకు చక్కని సౌకర్యాలతో బస్సు ఏర్పాట్లు చేయాలని నిర్ణయించినది. 1958 వ సంవత్సరంలో రోడ్డురవాణా సంస్థను ఏర్పాటు చేసింది. దశల వారీగా ఈ బస్సు మార్గాలను జాతీయం చేయటం ప్రారంభించింది. ఆంధ్ర ప్రాంతంలో ప్రప్రథమంగా కృష్ణా, పశ్చిమ గోదావరి, గుంటూరు, జిల్లాలలో బస్సు మార్గాలను జాతీయంచేసింది. తర్వాత కర్నూలు, కడప, అనంతపురం జిల్లాల్లో బస్సు మార్గాలను స్వాధీనం చేసుకొంది. ఇటీవల చిత్తూరు, తూర్పు గోదావరి జిల్లా బస్సు మార్గాలను తీసుకొని నడుపుతూంది. ప్రయాణీకులకు చక్కని సమర్థవంతమైన, సకల సౌకర్యాలను కల్పించే మహత్తర ఆశయం తోనే ప్రభుత్వం జాతీయం చేసే కార్యక్రమాన్ని ప్రారంభించింది. ఇతర రాష్ట్రాలకు కూడా ఈ రవాణా సౌకర్యములను, విస్తృత పరచింది. ప్రస్తుతం మద్రాసు కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలనుకలిపే మార్గాలనుకూడా నిర్వహిస్తున్నది.

13 డివిజన్లు ఆధ్వర్యంలో 75 డిపోల క్రింద 5000 బస్సులను ఈ ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ ప్రస్తుతం నడుపుతోంది. కేవలం బస్సు మార్గాలను జాతీయం చేసి బస్సులను నడపడంతోనే సరిపుచ్చుకోవటం లేదు. ప్రయాణీకులు సుఖంగా ప్రయాణం చేయటానికిగాను ఈ సంస్థ అనేక సౌకర్యాలను కల్పిస్తున్నది.

## గిరిజన ప్రాంతాలకు బస్సు సౌకర్యం

లాభమే ప్రధాన లక్ష్యంకాదు ఈ రోడు రవాణా సంస్థకి. సేవా ధ్యేయాన్ని ఎప్పుడూ విస్మరించటంలేదు. గిరిజనులు నివసించే ప్రాంతాలు చాలా వెనుకబడినవి. రహదారులు పెద్దగా అభివృద్ధి చెందనటు వంటివి. అయినా ప్రజలకు సేవ చేయాలనే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ బస్సు మార్గాలను వేసింది. ఈనాడు ఖమ్మం జిల్లాలోని వెంకటాపురం, బూర్గంపాడు, భద్రాచలం, తూర్పు గోదావరి జిల్లాలోని వై. రామవరం, రంపచోడవరం, రాజమండ్రి, సీలేరు, పశ్చిమ గోదావరి పోలవరం తదితర ప్రాంతాలకు కూడా బస్సు సౌకర్యం కల్పించి గిరిజన ప్రాంతాల అభివృద్ధికి ఒకవిధంగా దోహదం చేస్తున్నది. ఈ మార్గాలలో బస్సుల నిర్వహణ అంత లాభసాటి కాకపోయినప్పటికీ సేవా దృష్టితో ప్రజలకు ఈ సౌకర్యాలు కల్పించింది.



హైదరాబాదులో బస్సు బాడీలను నిర్మించే కేంద్రం

ఈ రోడ్డు రవాణా సంస్థ వినోద యాత్రల ప్రాముఖ్యాన్ని గుర్తించింది. యాత్రీకులకు, వినోద పర్యాటకులకు సౌకర్యాలను కల్పిస్తున్నది. దేశంలో ఉన్న యాత్రా స్థలాలను సందర్శించే అవకాశం కల్పించడానికిగాను, నేపాల్, బంగ్లాదేశ్ లాంటి సరిహద్దుల్లోని విదేశాల పర్యటనలకు ఛార్టర్ సర్వీసులను ప్రారంభిస్తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో కూడా వినోద యాత్రాలు, తీర్థ యాత్రాస్థలాలు కోకొల్లలు. సుప్రసిద్ధ చారిత్రిక ప్రదేశాలు కన్నులు పండువు చేసే సుందర దృశ్యాలు కలిగిన వినోద ప్రదేశాలకు వినోద విజ్ఞాన, యాత్రలను పెంపొందించే ప్రధాన లక్ష్యంతో పెద్దపెట్టున టూరిస్టు బస్సులను, హోటళ్ళను ఏర్పాటు చేయడానికి ఒక యాత్ర, పర్యటన విభాగాన్ని కూడా ఏర్పాటు చేసింది.

## ప్రయాణీకులకు సౌకర్యాలు

ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ చైర్మన్ శ్రీ నరసింగరావు గారిని కలిసి ఇంటర్వ్యూ చేసినపుడు, ఈ సంస్థ ఏ విధంగా ప్రయివేట్ యాజమాన్యం కంటే ప్రయాణీకులకు అదనంగా సౌకర్యాలు కల్పిస్తున్నదో వివరించమని కోరినపుడు, వారిలా అన్నారు. "ప్రయివేట్ యాజమాన్యంలో రవాణాఉన్నప్పుడుయాత్రీకులకు ఏవిధమైన సౌకర్యాలు కల్పించ లేక పోయేవారు. లాభమే ధ్యేయంగా వారి కార్యకలాపాలు, కార్యక్రమాలు సాగేవి.

"ప్రయాణీకులు నానాయిబ్బందులుపడేవారు. బస్సులు ఒక సి మం లేకుండా నిర్వహించబడేవి. ప్రయాణీకులు బస్సుకోసం వేచిఉండే స్థలాల దగ్గర ఏ విధమైన సౌకర్యాలు లేవు. ఎండ వేడిమి భరించి ఎండలో బస్సుకోసం నిరీక్షించ వలసిందే. వర్షానికి తడిసి ప్రయాణం సాగించటానికి వాహనంకోసం ఎదురుచూడవలసిందే. బస్సు డ్రైవర్‌కు ఇష్టముంటే బస్సు చకచకా సాగేది. వారి మార్గమధ్యంలో ఏమైనా పనులుంటే ఆ పనులుకూడా చూసుకుంటూ బస్సు పయనించేది. కనీసం బస్సు స్టాండు దగ్గర అయినా నీడ పట్టుండేది కాదు. ఉదాహరణకు మొన్న జాతీయం చేసిన రూట్లలో అమలాపురం, కాకినాడ, రాజమండ్రి, రావులపాలెం, కొత్తపేట ప్రదేశాలలో ఎక్కడా బస్సు షెల్టర్లుకూడా లేవు; ఈ విధమైన యిబ్బందులు ప్రయాణీకులకు లేకుండా చేయుటకు రోడ్డు రవాణా సంస్థ కృషిచేస్తున్నది. ఈ లోపల బస్సు స్టేషన్లకు, బస్సులకోసం నిరీక్షించటానికి వెయిటింగ్ హాలులలో, పాసింజర్ లాంజ్‌లను, దారి ప్రక్కన బస్సు షెల్టర్లను నిర్మాణం చేస్తున్నది. విజయవాడ, రాజమండ్రి, వరంగల్, కర్నూలు, విశాఖపట్టణం, పట్టణాలో హోటళ్ళనుకూడా నిర్మించే ఆలోచన ఉంది. ఈ కార్యక్రమాలకు అప్పుడే 2,5 కోట్ల రూపాయలు రోడ్డు రవాణా సంస్థ వెచ్చించింది. ఈ సంవత్సరం నాలుగు కోట్ల రూపాయలను వెచ్చిస్తున్నది. హైదరాబాద్, సికిందరాబాద్ జంట నగరాలలో ఈ మధ్య కోటి రూపాయల ఆర్థిక సహాయం పొంది అదనంగా బస్సులను వేసింది. మన రాష్ట్రంలో ఉన్న ఎంత దూర ప్రదేశాలకైనా ఒక్క రాత్రి ప్రయాణంలో వెళ్ళేలా బస్సు సౌకర్యాన్ని కల్పిస్తున్నా"రని శ్రీ పి. నరసింగ రావు గారు తెలియజేశారు.



రూ. 2 లక్షల వ్యయంతో నిర్మించిన సహకార పరపతి సంఘ భవనం

"ఇంకా రోడ్డు రవాణా సంస్థ అనేక ఇతర సౌకర్యాలను ప్రజలకు కల్పిస్తున్నది— తగ్గింపు రేట్లపై విద్యార్థులకు, క్రీడాకారులకు అంగవికలులకు, పత్రికా రచయితలకు, నాన్ గెజిటెడ్ ఉద్యోగులకు ప్రయాణపు సౌకర్యాన్ని కలగజేస్తున్నది." అని కూడా వివరించారు ఆ సంస్థ చైర్మన్.

ఈ సంస్థ ఆధ్వర్యంలో బస్సుల బాడీల నిర్మాణ విభాగం పనిచేస్తున్నది. ప్రతి నెలా సరాసరిని 18 బస్సు బాడీలను కడుతోంది. 'ఎప్పటికి మన రాష్ట్రంలో బస్సు రహదార్ల జాతీయం పూర్తి అవుతుం'దని అడిగినపుడు వారు సమాధానమిస్తూ 'ఐదో ప్రణాళిక అంతానికి బస్సు జాతీయం పూర్తి అవుతుం'దని అన్నారు. ఇంకా 16,000 మందికి ఉద్యోగ ఉపాధులు కల్పించబడతాయి. ఈ జాతీయ కార్యక్రమం పూర్తి అయేనాటికి ఈ సంస్థ ఆధ్వర్యంలో 6000 బస్సులు వరకు ఉంటాయి. ఉద్యోగులు, సంస్థ మధ్య సంబంధాలు ఎలా ఉన్నాయని అడిగినపుడు శ్రీ పి. నరసింగరావు గారు వివరిస్తూ ఇలా అన్నారు. "రోడ్డు రవాణా సంస్థ పనిచేసే సిబ్బందికేగాక, వారి కుటుంబాలకు ఉచిత వైద్య సౌకర్యంకూడా కలగజేస్తున్నది. ప్రస్తుతం హైదరాబాద్‌లో 40 లక్షల రూపాయల విలువజేసే ఆసుపత్రి నిర్మాణంలో ఉంది. ప్రతిచోట కుటుంబ ప్రయోజన సౌకర్యాలు, సాంఘిక రక్షణ సౌక

ర్యాలుకూడా ఈ సంస్థ కలగజేస్తున్నది. బాగా చదువుకొనే విద్యార్థులకు ఆర్థిక సహాయం జరుగనున్నది.

'మీ సంస్థలో కార్మికులకు ఒక సహకార పరపతిసంఘం ఉందని విన్నాను—ఆ సంస్థ ఏవిధంగాపనిచేస్తున్న'దని అడిగినపుడు రోడ్డు రవాణా సంస్థ ఛైర్మన్‌గారు ఆ సంస్థ కార్యకలాపాలను వివరించారు. ఈ సిబ్బంది సహకార పరపతి సంఘం ఇతర రాష్ట్ర సంస్థలకు ఆదర్శప్రాయంగా పనిజేస్తున్నది. 1952 సంవత్సరంలో కేవలం 2558 సభ్యులతో ప్రారంభించబడిన ఈ సంస్థ ఈనాడు 58,000 మంది సభ్యులతో 24 ,లక్షల రూపాయల వాటా ధనం కలిగి ఉంది. ఇప్పటికీ వాటాదార్లకు 11 కోట్ల రూపాయల అప్పులను అందజేసి 15 లక్షల రూపాయల లాభాన్ని సాధించింది. ఈ సంస్థలో సభ్యునికి నాలుగు నెలలునుంచి 18 నెలల జీతం మేరవరకు 15,000 అప్పులభిస్తుంది. ఆ అప్పును వాయిదాలలో చెల్లించాలి. ఈ సంస్థకు పొదుపు డిపాజిట్ల క్రింద 1 కోటి 68 లక్షల 50 వేల రూపాయల నిధులు ఉన్నాయి. ఏ సంస్థనుంచీ అప్పులు తీసుకోనకుండా ఆదర్శంగా పనిచేస్తున్న ఈ సహకార సంస్థ ప్రతి ఏడూ డివిడెండు వాటాదారులకు అందజేస్తున్నది. రెండు లక్షల రూపాయలు విలువగల రెండంతస్థుల భవనం వుంది. ఈ



దరఖాస్తులను పరిశీలిస్తున్న సహకార పరపతి సంఘం

సహకార సంఘానికి— అంతర్జాతీయ ప్రశంసలు అందుకున్న యీ సంస్థ ఉద్యోగుల సహకార పరపతి సంఘం రజతోత్సవాలు చేసుకున్నది.

గత సంవత్సరం 1.74 కోట్ల ఖర్చుతో కడపలో ప్రాంతీయ వర్క్ షాపు నిర్మించిందీ రోడ్డు రవాణా సంస్థ. ఇటువంటివి రాష్ట్రం మొత్తంమీద మూడు వర్క్ షాపులు ఉన్నాయి. మూడు టైర్ల రీట్రేడింగ్ షాపులుకూడా ఉన్నాయి.

## లాభాలు

గత సంవత్సరం 2 కోట్ల రూపాయలు లాభాలు ఆర్జించిన ఈ సంస్థకు రెండోసారి ఛైర్మన్‌గా శ్రీ పి. నరసింగరావు గారిని ప్రభుత్వం ఈ సంవత్సరం నియమించింది. కరీంనగర్ జిల్లాకు చెందిన శ్రీ నరసింగరావుగారు గత మూడు దశాబ్దాలుగా అభివృద్ధి కార్యక్రమాలలో, సాంఘిక సేవా కార్యక్రమాలలో పాల్గొంటున్నారు.



రూ. 1.74 కోట్లతో నిర్మించిన కడప ప్రాంతీయ వర్క్‌షాప్

**చిత్తూరు జిల్లాలో:**

# మా 'తీర్థం' చూసితీరాలి



తీర్థం అనగానే మన దేవస్థానాలలో ఇచ్చే తీర్థం అనుకుంటే మీరు పప్పులో కాలేసినట్లే. ఈ తీర్థం అటువంటి తీర్థం కాదు. చిత్తూరు జిల్లాలో పలమనేరు తాలూకాలో దాదాపు 2000 జనాభాతో, అన్ని రకాలైన సౌకర్యాలతోకూడి ఆదర్శప్రాయమైన గ్రామం ఈ "తీర్థం."

కొంత కాలం క్రితం ఈ గ్రామం ఎలాంటి సౌకర్యాలులేక చాలా వెనుకబడి వుండేది. కాని ఆ గ్రామం ఇప్పుడు అన్ని రకాలైన సౌకర్యాలతో అలరారుతూ అందరి నోటా ప్రశంసింపబడుతున్నది. గ్రామానికి విద్యుచ్ఛక్తి వుంది. రక్షిత మంచినీటి పథకం అమలు జరిగింది. ప్రాథమికోన్నత పాఠశాల వుంది. రవాణా సౌకర్యములున్నవి. పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం, ప్రసూతి కేంద్రం మున్నగునవి వున్నవి. గ్రామంలోని యువకులు, ప్రముఖులు అందరూ కలిసికట్టుగా పనిచేసి గ్రామాభివృద్ధికి ముఖ్య కర్త లయ్యారు.

## నేతాజీ యువక సంఘం

గ్రామంలోని నేతాజీ యువక సంఘంవారి కృషి, పట్టుదల ప్రశంసనీయమైనది. ఈ సంఘం 1974వ సంవత్సరం మార్చి 26న స్థాపించబడింది. అప్పటినుండి ఈ సంఘం గ్రామ పురోభివృద్ధికి కృషి చేస్తున్నది. గ్రామ ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికై ఒక గ్రంథాలయాన్ని, పఠనాలయాన్ని నడుపుతున్నారు. అనేక రంగములకు చెందిన పుస్తకాలతో, దిన, వార, మాస పత్రికలతో గ్రంథాలయాభివృద్ధికి కృషి చేస్తున్నారు.

గ్రామంలోని ఒక పోరంబోకు స్థలాన్ని శ్రమదానంతో బాగుచేసి ఆటల మైదానాన్ని తయారు చేశారు. చిత్తూరు నెహూర్రు యువక కేంద్రం నుండి లభించిన వాలీబాల్, టెన్నికాయిట్, బ్యాట్మింటన్ మొదలైన ఆటలలో యువకులకు శిక్షణయిచ్చి ఉత్సాహపూరితులను చేస్తున్నారు.

అత్యధిక సాధక బాధకాలకులోనై 3 మైళ్ళ పొడవున రోడ్డు పునర్నిర్మించి, జిల్లా రవాణా అధికారులతో సంప్రదించి, కలెక్టరుగారి సహాయంతో గ్రామానికి రవాణా వసతి కల్గించి గ్రామానికి వన్నె తెచ్చారు.

గ్రామ సర్పంచ్ శ్రీ పి. వెంకట్రాయశెట్టిగారు యువకుల కార్యక్రమాలన్నింటిలోనూ పాల్గొని, తన సహాయ సహకారాలను అందించి అభివృద్ధి కార్యక్రమాలకు వెన్నెముక అయ్యారు.

సర్పంచ్, గ్రామ పెద్దల సహకారంతో వీరు గ్రామంలో రక్షిత మంచినీటి పథకాన్ని జయప్రదం గావించారు. గ్రామస్థులు 40,000 రూ॥లను సమకూర్చారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ జాతీయ సేవా పథకం వలంటీర్లు ఈ కృషిలో బాగా సహకరించారు. గ్రామంలో 12 వీధి కొళాయిలు, 75 ఇండ్ల కొళాయిలు వున్నాయి.

యువకసంఘ సామర్థ్యాన్ని గుర్తించి సర్పంచ్ శ్రీ పి. వెంకట్రాయశెట్టిగారు గ్రామపంచాయతీ కాంట్రాక్టును, మండల వికాసాధికారి శ్రీ కె. చెంగల్రాయనాయుడుగారు సమితి కాంట్రాక్టును వీరికిచ్చారు. కాంట్రాక్టులను దిగ్విజయంగా పూర్తిచేసి, సంఘ నిధులను అభివృద్ధి చేస్తున్నారు.

గ్రామంలో చౌక దుకాణాన్ని నెలకొల్పారు. ఆహార ధాన్యాలు అనగా బియ్యం, గోధుమలు, చక్కెర మున్నగు వస్తువులు చౌక ధరలకు విక్రయిస్తూ బడుగు వర్గాలకు సౌకర్యం కలుగజేస్తున్నారు. "కంట్రోల్డ్ క్లాత్" చౌకరకం గుడ్డలు కూడా విక్రయించి మన్నన పొందుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ సలహా మండలివారు సంఘ కార్యక్రమాలకు తృప్తిచెంది 1975–76కు రూ. 1,000, 1976–77కు రూ. 1,000 గ్రాంటు ఇచ్చారు.

స్పోర్ట్సు టోర్నమెంట్, సంఘ స్వంత భవనం, డైరీ యూనిట్ మొదలగునవి వారి భవిష్యత్కార్యక్రమాలు.

ఈ విధంగా ప్రజల అండదండలతో, ప్రముఖుల సహాయ, సహకారాలతో, అధికారుల సహకారంతో, యువకుల కార్యదీక్షతో, ఐకమత్యంతో తీర్థం గ్రామం సర్వతోముఖాభివృద్ధిని సాధించి ఆదర్శవంతమైంది.

—శ్రీ పరిపాటి వేణుగోపాల్

సీరియల్:




**16**

లక్ష్మి ప్రకాశాన్ని ప్రేమించిందనీ, హరిజనవాడలోనే వుంటుందట అనే సంగతి కారుచిచ్చులా క్షణాలలో వూరంతా వ్యాపించింది. ఇటువంటి విషయాలు పల్లెలలో రహస్యంగా వుండవు. పట్టణాలలో అయితే పక్క ఇంట్లో జరిగే సంగతులు కూడా తెలియవు. కాని పల్లెలలో అలాకాదు!

చౌదరి తలెత్తుకొని వూళ్లో తిరగలేక పోయాడు! ఇంతటి అవమానం ఆయన జీవితంలో ఎన్నడూపొందలేదు. అందునా తన ఆశలన్నీ ఎవరిమీద పెట్టుకొని ఇన్నాళ్లూ రెండో పెండ్లి కూడా చేసికోకుండా జీవించాడో ఆ కూతురే తన గుండెల్లో మంటలు రేపింది. అదే మరొకణ్ణి, సాటివాణ్ణి ప్రేమిస్తే ఇంతబాధ కలిగేది కాదు!... తన ఇంటి కుక్క.... ! తన కాళ్లదగ్గర బ్రతికే వెధవ.. ! తన లక్ష్మిమీద మత్తుమందు జల్లాడే....అని బాధ!

ఆ వెధవ రామదాసుతో తాను వియ్యమందాలా? ఆ ప్రకాశం గాడి కాళ్లు కడిగి కన్నెనివ్వాలా? చౌదరి మరి వూహించుకో లేక పోయాడు.. !

రెండు రోజులు నిద్రాహారాలుమాని ఏమీ తోచక రామదాసుకు కబురు పెట్టాడు.

రామదాసు భయపడుతూ వచ్చాడు. వచ్చి సవినయంగామనవి చేసుకున్నాడు. 'బాబుగారూ! మీ పాదాల చెంత బ్రతికినవాళ్లం! మీ పాదాలను నమ్ముకొన్ని వుండబట్టి ఈ రోజు రెండు పూటలా ఇంత తిన గలుగుతున్నాం! ఈ రోజు మీ ముందు ముఖం చూపించలేక పోతున్నాను. చిన్నమ్మగారు బొత్తిగా నా మాట వినటంలేదు బాబూ! ఆయమ్మ ప్రకాశాన్ని చేసుకొంటుందట! ...లేకపోతే ప్రాణాలే విడుస్తుందట!...చిన్నమ్మగారు బహు పట్టుదల మీద వున్నారు!'

మామూలు రోజులలో అయితే రామదాసు మాటలకు చౌదరి విలువ ఇచ్చేవాడు. కాని ఇప్పుడు చౌదరిని క్రోధం ఆవరించింది క్రోధం వివేకాన్ని హరిస్తుంది. ఏది చెప్పినా కోపంగా వున్న మనిషికి విపరీతంగానే తోస్తుంది.

చౌదరి మండి పడ్డాడు.

'చిన్నమ్మగారు వినకపోతే నీ కొడుక్కు చెప్పొచ్చుగా. నీ కొడుకు వింటాడుగా.' చౌదరి మాటలలో అక్కసు ద్యోతకం అవుతున్నది.

'బాబుగారూ! వాడు వింటే నాకీ తలవంపులు ఎందుకు వుంటాయి. పెద్దవాడేమో అలా ఏడిపించాడు. వీడేమో ఇలా!' సానునయంగా పలికాడు రామదాసు.

'అవ్వ! ఎంతమాట! పైగా నా కుతురు నీ ఇంటికి వస్తే, నీకు తలవంపులుగా వుందా? దాసూ! నీ జాతే అటువంటిది. నీ జాతి సంగతి పూర్తిగా తెలుసు కాబట్టే వెనకటివాళ్లు మిమ్మల్ని దూరంగా వుంచారు.'

'నిన్ను చేరదీయటం నాదే పొరపాటయింది. అందుకు నాకు తగిన శిక్ష విధించావు. బలేశాస్తి చేసావు దాసూ! బాగా గుణపాఠం నేర్పావు! మొత్తానికి బలేప్లాను వేసావు. నా కూతుర్ని లోబరచుకొని దానిద్వారా నా ఆస్తికాజేయాలను కుంటున్నావు కదూ! ఆ పప్పులేం వుడకవు ఇక్కడ...! జాగ్రత్త!' తన ఆక్రోశం వెళ్ల గ్రక్కాడు చౌదరి.

'బాబుగారూ! ఎంతమాట! మీ ఆస్తికాజేదామనే ఆలోచన మా రక్తంలో కూడాలేదు. మా రెక్కలే చాలుమాకు. అవే మాకు ఆస్తి.....'

'అమ్మాయి గారిది చిన్నతనం: ప్రపంచం ఏమీ తెలియదు. నాలుగు రోజులు వుంటే, అమ్మాయి గారు కూడా కాస్త చల్లబడు తారు ఎలాగో నచ్చచెప్పి మీ అమ్మాయిని మీకు అప్పగిస్తాను'

రామదాసుకు దుఃఖం ముంచుకొని వస్తున్నది లేచి కండు వాతో కళ్లు తుడుచుకొని, నెమ్మదిగా అడుగులు వేసికొంటూ ఇంటికి వెళ్లి పోయాడు.

చౌదరి మాత్రం ఆ షాక్ నుంచి పూర్తిగా కోలుకోలేక పోయాడు తప్పంతా ప్రకాశంగా తోచింది ఆయనకు వాడే తన కూతురుని మాయమాటలు చెప్పి ఇష్టం వచ్చినట్లు ఆడిస్తు న్నాడు

పోలీసులకు రిపోర్టిచ్చాడు చౌదరి, ప్రకాశం తన కూతుర్ని లేవతీసికొని వెళ్లాడని

ఈ సంగతి వూరంతా తెలిసిపోయింది.

చౌదరికి వూళ్లో శత్రువర్గంలేక పోలేదు ముఖ్యంగా ఆయన గత ఇరవై ఏండ్లుగా పంచాయతీ ప్రెసిడెంటుగా గ్రామాన్ని నిరంకుశంగా పాలించటం చాలామంది. కంటకంగానే వుంది ఎలా గయినా ఆయన్ని ఎన్నికలలో ఓడించాలని వాళ్లందరికీ పట్టుదలగా వుంది ముఖ్యంగా యువకులు మంచి పట్టుదలగా వున్నారు వాళ్లంతా అభ్యుదయ సమితి పేరుతో ఏకమైనారు. వాళ్ల నాయకుడు రమేశ్. రమేశ్ అంటే ఎవరో కాదు చౌదరి దగ్గరి బంధువే చౌదరికి అన్న కొడుకే రమేశ్ తండ్రి. చౌదరి ఇద్దరూ అన్న దమ్ముల బిడ్డలు.

ఎన్నికలలో చౌదరిని ఓడించటానికి రమేశ్ పార్టీ అవకాశం కోసం ఎదురు చూస్తున్నది: లక్ష్మి సంఘటన చౌదరి వ్యక్తి గత విషయమైనా రమేశ్ పార్టీవాళ్లు దీన్ని గ్రామ రాజకీయాలకి బాగా విని యోగించుకున్నారు.

పోలీసులు వచ్చేసరికి రమేశ్ పార్టీవాళ్లు లక్ష్మి, ప్రకాశం ప్రేమించుకున్నారనీ, చౌదరి వాళ్ల ప్రేమకు అడ్డుపడుతున్నాడనీ ఈ ఆదర్శ వివాహం పోలీసులే దగ్గరవుండి జరిపించాలనీ అర్జీ పెట్టుకున్నారు

రామాపురం రెండు వర్గాలుగా చీలిపోయింది. లక్ష్మి-ప్రకాశంల వివాహం జరగాలనే వాళ్లది ఒకవర్గం వద్దు అనేవాళ్లది మరొక వర్గం.

దీన్నే మరోమాటలో చెప్పాలంటే చౌదరి అంటే ఇష్టంలేని వాళ్లది ఒకవర్గం-చౌదరిది మరొక వర్గం

పోలీసులు వచ్చారు.

వాళ్లు అర్జీలు పరిశీలించనేలేదు: తిన్నగా హరిజన వాడకు వెళ్లారు.

ప్రకాశాన్నీ-లక్ష్మినీ పిలిపించారు:

ప్రకాశాన్ని అరెస్టు చేస్తామని బెదరించారు

ప్రకాశం భయపడలేదు ఎందుకు? అని ప్రశ్నించను కూడా లేదు

అప్పుడు లక్ష్మి ముందుకు వచ్చింది

'ప్రకాశాన్ని ఎందుకు అరెస్టు చేస్తున్నారో తెలిసికోవచ్చునా?' సూటిగా అడిగింది ఇనస్పెక్టర్ని

ఎందుకంటే పరువు ప్రతిష్ఠలుగల కుటుంబంలోని ఆడ పిల్లను బలవంతంగా తీసుకొని రావటం నేరం కాదా?' అన్నాడు ఇనస్పెక్టరు అధికార దర్పాన్ని ప్రదర్శిస్తూ

'ఇన్‌స్పెక్టరుగారూ: విషయం తెలిసికోకుండా మాట్లాడు తున్నారు నన్ను ఎవరూ బలవంతగా తీసికొనిరాలేదు: నా అంతట నేనే ఇష్టపడి వచ్చాను' దృఢంగా జవాబిచ్చింది లక్ష్మి.

'అయితేనేం: నీవింకా చిన్నపిల్లవి: తండ్రి చాటు పిల్లవి:' లక్ష్మి మాటలను తేలికగా కొట్టి పారేస్తూ అన్నాడు ఇనస్పెక్టరు

'ఇనస్పెక్టరుగారూ: నేను చిన్నపిల్లనేం కాదు: నాకు ఇరవై ఏళ్లు నిండాయి: మేజరుని: నా మంచి చెడలు నిర్ణ యించుకొనే స్థితిలో నేనున్నాను: నేను ప్రకాశాన్ని పెండ్లి చేసుకో దలచాను ఇందుకు ఒకరి ఆజ్ఞతో నాకు పనిలేదు. ప్రకాశం నన్ను తీసికొని రాలేదు: నేనే వచ్చాను కాబట్టి మీరు అనవసరంగా మా విషయంలో జోక్యం చేసికొని ఇబ్బందుల పాలు కావద్దు'

గట్టిగా సమాధాన మిచ్చింది లక్ష్మి

రమేశ్ అనుచరులంతా ఒక్కసారిగా అరిచారు. "లక్ష్మి-ప్రకాశం జిందాబాద్: వారి ఆదర్శప్రేమ వర్ధిల్లాలి. వారి వివాహం జరగాలి.. :::"

పోలీసు ఇనస్పెక్టరు ఏమీ చేయలేక పోయాడు: స్వయంగా లక్ష్మి ఇష్టపడుతున్నప్పుడు తాను చేయగలిగింది ఏమీ లేదని చౌదరికి చెప్పి వెళ్ళి పోయాడు.

## 17

ఎన్నికలు: ... ఎన్నికలు... ::

స్వరాజ్యం వచ్చిన తర్వాత ఎన్నికలు గ్రామ జీవితంలో ప్రధాన భాగాలయ్యాయి. గ్రామ ప్రజలను ఎన్నికలు చైతన్య వంతం చేశాయనటంలో సందేహం లేదు

కాని ఆ చైతన్యంతోపాటు గ్రామ జీవితాన్నికూడా కలుషితం చేశాయి ఎన్నికలు: సంకుచితత్వాన్నీ, కులతత్వాన్నీ నిర్మూ లించటానికి బదులుగా, ఎన్నికలు వాటికి మరింత బలం చేకూర్చాయి.

ఎన్నికలతోపాటు ధనం కూడా రంగంలో ప్రవేశించింది. ధనప్రభావం విపరీతంగా పెరిగి చివరకు ఎన్నికలు ధనవంతులు ఆడుకునే ఆటలా తయారయ్యాయి:

దరిద్రం-అజ్ఞానం-నిరక్షరాస్యతలో మునిగి తేలే పేదప్రజలకు ఎన్నికలు ఒక వినోదం...! ఆ ఎన్నికలప్పుడు గొప్పవాళ్లు తమ ఇళ్లకు వస్తారు! 'ఓటు వేయండి' అని బ్రతిమాలుతారు! అవసరాన్ని బట్టి తమ ఓటుకు ధనరూపంలో విలువ గట్టి ఇస్తారు!

రామాపురం అందుకు అపవాదం కాదు! గ్రామంలో రెండు పార్టీలు! ఒకటి నాగయ్య గారిది! రెండోది ఆయన్ని వ్యతిరేకించే వారిది! విచిత్ర మేమంటే రెండో పార్టీ నాయకుడు కూడ నాగయ్య గారి బంధువే! జ్ఞాతివైరం తీర్చుకోటానికి ఎన్నిలు బలే సాధనాలయ్యాలు!

అప్పుడు ఎన్నికలు!

చౌదరి గత 20 సంవత్సరాలుగా పంచాయతీకి ప్రెసిడెంటు. ఈ ఇరవై ఏళ్లలో ఆయనకు ఎదురు లేదు! క్రిందటి ఎన్నికలలో కొంత వ్యతిరేకత కనిపించిది కాని చౌదరే గెలుపొందాడు.

ఈ సారి చౌదరి వ్యతిరేకత బలం పుంజుకొంది. గ్రామంలో రమేశ్ పార్టీ యువకులనూ, కార్మికులను బాగా ఆకర్షించింది! వాళ్ల నినాదాలు జనంలో కాస్త ఆశ రేకెత్తించాయి!

చౌదరికి ఉత్సాహం తగ్గి పోయింది! లక్ష్మి చేసిన పనినుంచి ఆయన తేరుకోలేక పోయాడు! పైకి గంభీరత తెచ్చి పెట్టుకున్నా లోలోపల బాధగానే వున్నది!

ఈ సారి పోటీ చేయకూడదనే అనుకున్నాడు! కాని ఆయనను ఇన్నాళ్లూ ఆశ్రయించుకున్న వాళ్లు వూరుకోనివ్వ లేదు! "గ్రామాధికారాన్ని కుర్రకుంకల చేతికి అప్పగిస్తారా!" అని ప్రశ్నించారు.

చౌదరి పోటీకి అంగీకరించక తప్పలేదు!

వార్డులవారీగ ఎవరిని నిలబెట్టాలిసింది పెద్ద సమస్య అయింది. నిలబడాలనే ఉత్సాహవంతుల సంఖ్య ఎక్కువ. వార్డుల సంఖ్య తక్కువ.

ఎన్నికలు గ్రామాన్ని వార్డుల వారీగా చీల్చటమే కాకుండా ప్రతివార్డునూ రెండు మూడు భాగాలుగా కూడ చీల్చాయి! చివరకు నల్లమోతువారి బజారులో నల్లమోతువారినీ, చెన్నుపాటి వారి బజారులో చెన్నుపాటివారినీ నిలబెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇంకొకరిని నిలబెడితే గెలుస్తారనే నమ్మకంలేదు!

అభ్యర్థుల నిజాయితీని బట్టిగాక, గెలిచే అవకాశాలను బట్టి నిర్ణయించ వలసి వచ్చింది.

అయినా కొందరికి సంతృప్తి కలుగలేదు! హరిజనవాడ నుంచి ఎవరిని నిలబెట్టాలిసిందనేది ఈసారి సమస్య! రామదాసంటే హరిజనులకు గౌరవం వున్నది. అందుచేత పోటీ లేకుండా ఎన్నికవుతూ వచ్చాడు!

ఈసారి రామదాసుని నిలబెట్టడానికి చౌదరి ఒప్పుకోలేదు.

రామదాసుని కాదని ఎవరిని నిలబెట్టాలన్నా గెలవటం కష్టం. చివరకు సుబ్బి మొగుడు వెంకులుని నిలబెట్టడానికి నిశ్చయించారు. వెంకులుకు పలుకుబడి వున్నదనికాదు. వెంకులు నోరుగలవాడు! వాణ్ణి చూస్తేనే భయం జనానికి ' తాగుబోతు! వాడి జోలికి పోరు సాధారణంగా!

అంతకు తప్ప మరెవరిని నిలబెట్టడానికీ వీలులేక పోయింది చౌదరికి.

రమేశ్‌పార్టీ వాళ్లు ఎత్తుకు పైఎత్తు వేశారు! అన్ని వార్డులకు పోటీ చేశారు. చౌదరి ఎవరినైతే నిలబెట్టాడో వాళ్ల బంధువులలోనుంచే తమ తరపున అభ్యర్థుల్ని నిలబెట్టారు! బంధువులు నిలబడని చోట వాళ్ల బజారు వ్యక్తినే మరొకర్ని నిలబెట్టారు!

హరిజనవాడలో అభ్యర్థిగా రామదాసుని నిలబెట్టడానికి ప్రయత్నించారు!

రామదాసు 'ససేమిరా' పోటీకి నిలబడనన్నాడు! ఎంత మంది చెప్పినా ఒకటే మాట! "చౌదరిగారి ఉప్పు తిని బ్రతికాం! వారికి వ్యతిరేకంగా నిలబడేది లేదు!"

చివరకు ప్రకాశాన్ని నిలబెట్టటానికి నిశ్చయించారు రమేశ్ పార్టీ వాళ్లు.

ప్రకాశం కూడా మొదట ఒప్పుకోలేదు. కాని యువకులంతా బలవంత పెట్టారు. చివరకి వెంకులు మీద పోటీకి ఒప్పుకొన్నాడు!

పెద్ద బరువు దించినట్టయింది రమేశ్‌కు!

ఇరుపక్షాలు తీవ్రంగా ప్రచారం చేసుకొన్నాయి. ఇంటింటికీ తిరిగి ఓటర్లకు చెప్పకున్నారు. వాగ్దానాలు కురిపించారు.

చౌదరి వెంకులుకు అయిదు వందలిచ్చాడు! వెంకులు రొట్టె విరిగి నేతిలో పడ్డట్టు అయింది! అందులో రెండువందలు తాగేశాడు! ఓటర్లలో ముఖ్యులయిన వాళ్లకు మూడువందలు పంచి పెట్టాడు!

ప్రకాశం తరపున లక్ష్మి హరిజన వాడంతా తిరిగి ప్రచారం చేసింది ' ఇంటింటికీ వెళ్లి ఓట్లు అడిగింది. ప్రకాశం అంటే చాల మందికి మంచి అభిప్రాయమే వున్నది! అయినా అభిప్రాయం వేరూ—ఓట్లు వేరూగదా! దేని దారి దానిదే!

ఎన్నికల రోజున రమేశ్ వచ్చాడు హరిజన వాడకు! వెంకులు తరపున మనుషులు హుషారుగా పనిచేస్తున్నారు! దానికి కారణం వెంకులంటే అభిమానం వుండికాదు! వెంకులు డబ్బు ఖర్చుపెడుతున్నాడు. అందుకని!

ప్రకాశం డబ్బు ఖర్చు పెట్టలేదు! అందుచేత ప్రకాశం వెంట తిరిగే మనుషులు కూడా తక్కువే వున్నారు!

వెంకులు మనుషులు ఉత్సాహంగా ఓటర్లను చేరవేస్తున్నారు!

రమేశ్ చూశాడు! పరిస్థితి చేయిజారి పోయేట్టుగావుంది! ప్రకాశం ఎంత మంచివాడైనా గెలిచేట్టుగా లేదు!

అంతలో మంగి కనిపించింది రమేశ్‌కి. 'మంగీ ! ఓటు వేశావుటే' అడిగాడు రమేశ్ ! 'ఓటు ఎవరికి కావాలి బాబూ ! కూలికి పోతేగాని పూట గడవని మనుషులం' అన్నది మంగి.

'ఓటు వేసి పోరాదూ ! కూలికి' బ్రతిమాలాడు రమేశ్.

'ఆ ైనులో నిలబడి ఓటుచేసే సరికి గంట పడుతుంది ! అందాకా ఆసామి వూరుకుంటాడా పనిలోకి రాకపోతే ! ఈ పూటకు తిండి లేదుగాని ఓటు ఏం చేసుకుంటాం బాబూ !' అన్నది మంగి.

రమేశ్ ఒక క్షణం ఆలోచించాడు ! వెంటనే తన మనుషుల్ని పిలిచి హరిజన వాడలో ఓటర్లందరికి ఒక రోజు కూలి పంచి పెట్టాడు !

'పొండి ! ఇదిగో రోజు కూలి !, ఓటువేసి ఇంటికి పొండి' అన్నాడు.

'మరి ఏంపని చేయాలి' అడిగింది ఒక స్త్రీ ఓటరు, 'ఇదే పని ! ఓటువేయటమే పని ! వేరేపని లేదు పొండి !' అన్నాడు రమేశ్.

వాళ్లకు సంబరమేసింది ! జనం విపరీతంగా వచ్చారు. కూలి తీసికొని ఓటువేసి పోయారు !

ప్రకాశానికి సంగతి తెలిసి బాధపడ్డాడు ! తన ఆదర్శానికి వ్యతిరేకంగా రమేశ్ ప్రవర్తించాడు ! రమేశ్‌ని నిజంగా 'అభ్యుదయవాది' అని అనుకున్నాడు ! కాని ఇలా ఓట్లు కొంటాడనుకోలేదు !

ఆ సంగతే రమేశ్‌ని అడిగాడు. 'మీరు చేసిన పని ఏమీ బాగా లేదు రమేశ్ !'

రమేశ్ నవ్వి తేలికగా కొట్టిపారవేశాడు. 'ఇందులో బాధ పడాల్సిన సంగతి ఏముంది ? అవతల మాత్రం ఖర్చుచేయలేదా'

'అవతల వాళ్లు తప్పుపని చేశారని మనం కూడా చేస్తామా' అన్నాడు బాధపడుతూ ప్రకాశం.

'కుక్కకాటుకు చెప్పుదెబ్బ అంటే ఇదే ! మనం డబ్బు ఖర్చు పెట్టక పోయినట్లయితే నీకు ఓట్లు పడేవికావు ! నీ మంచితనాన్ని చూసి ఎవరూ ఓట్లు వేయరు' అన్నాడు రమేశ్.

'వెయ్యకపోతే పోనీ ! ఓడిపోయేవాళ్ళం ! మంచి మార్గంలో వుండి ఓడిపోయినా సంతోషమే'

'ఓడిపోయేదానికి ఈ అట్టహాసం ఎందుకూ ? నిలబడటం ఎందుకూ ?' అన్నాడు విసుగ్గా రమేశ్.

ప్రకాశం మాటాడలేక పోయాడు. రమేశ్‌కి లొంగిపోయినట్టనిపించింది ! ' రమేశ్ తన డబ్బుతో ఓటర్లను కాదు కొనుక్కొన్నది ! నన్ను ' అనుకున్నాడు ప్రకాశం.




ఎన్నికల ఫలితాలు తెలిశాయి ! 'అభ్యుదయ సమితి' అభ్యర్థులు ఘన విజయం సాధించారు ! చౌదరి నిలబెట్టిన వాళ ందరూ ఓడిపోయారు ! స్వయంగా చౌదరి రమేశ్ చేతిలో ఓడిపోయాడు !

హరిజన వాడలో ప్రకాశం వెంకులు మీద పెద్ద మెజారిటీతో గెలిచాడు ! రమేశ్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయ్యాడు !

రమేశ్ పా ్ట సభ్యులంతా ైరు బండిమీద వూరేగారు. వాళ్ల అభిమానులు దండలు వేశారు. స్త్రీలు హారతులు ఇచ్చారు !

ప్రకాశం 'జైరు బండిమీద కూర్చోన'ని అన్నాడు. రమేశ్ బలవంత పెట్టలేదు ! 'సరే నీ యిష్టం' అన్నాడు.

'పోనీ హరిజన వాడలో వూరేగింపు చేసుకుంటావా' అని అడిగాడు రమేశ్.

'అసలు ఎక్కడావద్దు !' అన్నాడు ప్రకాశం. రమేశ్ మరి మాటాడలేదు !

ఊరేగింపులో బాణసంచా కాల్చారు ! ఊరేగింపు చౌదరి ఇంటిముందుకి వచ్చే సరికి మరీ సంతోషాన్ని పట్టలేక పోయింది.

'రమేశ్ జిందాబాద్ ! రమేశ్ జిందాబాద్ ! !' అనే నినాదాలు దిక్కులు పిక్కటిల్లాయి.

చౌదరి అవమానంతో ఇంట్లో వుండిపోయాడు ! తలుపులు వేసికొని లోపలనే వుండిపోయాడు ! ఇరవై ఏళ్లుగా తన చేతిలో వున్న అధికారం ఈ నాటితో జారిపోయింది !

దీనికంతటికీ కారణం ప్రకాశం ! లక్ష్మితో పాటు తన పరువు ప్రతిష్ఠలు కూడా తొలగి పోయాయి !

బయట ఊరేగింపు విజయోత్సవం చేసికొంటున్నది ! ' కానీయ్ ! కుర్రకుంకలు ! వాళ్లు ఏం చేస్తారో చూస్తాను ' పళ్లు బిగించాడు చౌదరి.

(సశేషం)

---

**హరిజనులు, గిరిజనులు, యితర వెనుకబడిన వర్గాల సంక్షేమానికి ప్రభుత్వం కట్టుబడివుంది.**

---

# పదండి పోదాం
# పరిశుభ్రి లోకం లోకి







కశ్మలంతో నిండిన

మురికి వాడల్లో దుర్భర

జీవితానికి స్వస్తి చెప్పి....









# సూది మందు

—శ్రీ బలివాడ రామకృష్ణారావు



చిన్న కథ :

సూరీడు పడమటి కొండలో కుంకుతున్న యేల, సింత సెట్లు లంకలో సీతమ్మోరిలా జుత్తు యిరబోసుకొని పలసని మసక సీకట్లో దయ్యాల్లా నిలుసున్నయేల. సీతమ్మ సెరువులో కలువలు సెందురుని అందాన్ని సూసి గంతు లిడుతున్నయేల. సిన్న పిల్లల్ని కడుపులో దాసుకొని పెద్ద పిట్టలు గూల్లల్లో సిన్న సిన్న కునుకులు తీస్తున్న యేల, సెరు వొడ్డుగనున్న 'రావులోరి గుట్ట' మీదకూకొని ఈరి పంతులుగోరు సెప్పిన 'యెంకిపాటలు' పాడు కోడం సిన్నిగాడికి మాసరదా.

ఆ పాటల అందం ఆడికి తెలీదు–ఆటి అర్దం అంతకంటె తెలీదు. కాని ఆటి అర్దంకంటె, ఆటి అందంకంటె కూడ ఆ పాటలు ఆడు బాగా పాడగలడు అని అందరూ అనుకుంటుంటారు. ఆ మాటే రంగి అన్నప్పుడు..........

.......రంగి....రంగి గురుతుకు రాగానే ఆడికల్ల కన్నీటి కుండలయి పోతాయి. శేవన మేగాలయి పోతాయి

"రంగి....తన రంగి....తన పేనం....తనగానం.... ఆడి కారోజు బాగాగురుతుంది. ఈయాల లాగే పాడుకుంటున్నాడు. "శేనా బాగాపాడుతుండావ్. మరోటిపాడు."

ఆడు తలెత్తి సూసాడు ఎవరా అని.

సూరీడు పడమటి కొండలో కుంకి పోతూ సివరికానుకగా బూదేవికి పెసాదించిన కానుక లాగా, సిక్కని మేగాల సందుల్లోంచి సూసి తళుక్కున మెరిసిన బాదరపద మాసం మెరుపు లాగా, ఉన్న రంగి ఆడిని సూసి కిసుక్కున నవ్వింది.

"ఏందలా నవ్వుతావ్? అసలెవరు నువ్వు?" కనుబొమలు ఎత్తి సిన్న సూపొకటి దాని పైకి ఇసిరి అడిగాడు ఆడు.

"నానెవరో ఆనక సెబుతాను. కాని నువ్వు మరోపాట పాడ కూడదూ?" ఆడి కెదరగా కాల్లు ఎనక్కిమడిసి కూకొని సూపుడు ఏలు బుగ్గ మీద, బొటనేలు గడ్డం మీద ఆనించి ఆడి వంకే సూసి మల్లా పాడ మని ఆడిని బతిమాలింది.

అంతే. ఆడు ఆగకుండా ఆరేడు పాటలు పాడినాడు. ఆ పాటలు యింటూ అది, దాని అందం సూసుకొంటూ ఆడు–ఎదరెదరగా ఎంతో సేపు అలానే కూకుండి పోయారు.

ఎంతో సేపటికి ఇద్దరూ యీ లోకంలోకి వచ్చారు. "అబ్బో....శానా సీకటి పడింది." బెదురుగా సూస్తూ బయంగా అంది రంగి.

"నీకేం బయం లేదు. నాను దిగబెడతాను. యింత కీ ఎవురు నువ్వు" లెగిసి బట్టలు దులుపు కుంటూ అడిగాడు ఆడు.

"నాను రంగిని." ముద్దమందారంలా ముడుసుకు పోతూ సిగ్గుతో అంది రంగి. "యిక్కడికి రొండు కోసుల దూరంలో ఉన్న కుష్ణాపురంలో అయ్యిద్దరం ఉంటున్నాం"

ఆడు ఆ రేతిరి దానికి తోడుగా అలింటి కెళ్ళాడు. ఆ విధంగా ఆల్లిద్దరూ తొలిసారిగ కలుసుకున్నారు. ఆ తరవాత పెతీ రోజు సల్లనియేలల్లోనూ....ఎన్నెల యేలల్లోనూ .... సీకటి యేలల్లోనూ....కలుసుకుంటన్నారు. మనసూ మనసూ యిచ్చు కున్నారు. మనువు సేసుకోవాలనుకున్నారు.

సిదబదపడుతున్న సినుకుల్లో సింత సెట్టు కింద ఆ లిద్దరూ కూకొని తడిసిపోతూన్న రెక్కలు టపటపా కొట్టుకొంటున్న పిట్టల్ని సూసి సంబర పడిపోతారు.

ఆడు దాని ముక్కు పట్టుకొని "ఒలే రంగీ. ఈరి పంతులు గోరు సెప్పిన యెలిజబెతు సిమ్మాసనం ఈ ముక్కు పాటి సెయ్యదే !" అని ముద్దెట్టుకుంటాడు. అది మల్లి మొగ్గలా ముడుసుకు పోతాది. ఆడు దాని కాలి కడియాలతో ఆడుకుంటాడు.

రంగి ఆడిఒడిలో కూకొని ఆడి నుదురుపై పడుతున్న జుత్తులో ఏల్లుజొనుపుతూ "మాఁవా! పేెవ అంటారేటి?" అంటాది అమాయకంగా, అడుగోదారిలా గలగలా నవ్వుతాడు. "ఒలే నానేటి ఈరి పంతులు గోర్నా ! నీ పెశనలకి జెవాబు సెప్ప కోడాన్కి నానేటి సదూకున్నానా ? అయినా...ఒలే రంగీ.... అమురుతం సినుకుల్లాంటిది ఆడదాని మనసు. పంట భూమి లాంటిది మొగోడి మనసు. ఆ సినుకులు ఈ పంట భూమి మీదపడి బంగారం పంట పండినట్టు ఆరొండు మనసులూ కలుసుకున్నప్పుడు పేెవ పుడతాది." అని ఆడికి తెలిసిన బాసలో ఆడు సెబుతాడు. ఆడి తెలివి తేటలకు అది మురిసి పోయి బహుమతిగా ఆడి కన్నుల పై ముద్దుపెట్టుకుంటాది.

మల్లె పందిరిలాంటిది రంగి, తెల్ల గన్నేరులా తెల్లగా నవ్వుతూ ఆడిని అడుగుతాది. "మాఁవా ! నానంటే నీకిష్టమేనా ?" అని. ఆడు దాన్ని సేతుల్లోకి తీసుకొని గుండె కదుముకుంటూ "రంగీ. ఆ రావులోరికైనా మరో ఆడదాని మీద మనసు పుట్టొచ్చు గాని ఈ సిన్నిగాడికి నివ్వేపేణం" అంటాడు.

ఆ లిద్దరూ సీతమ్మ సెరువులో పందాలేసి ఈత కొడతారు. "మాఁవా ! శేవణ పున్నం శానా దూరం పోతుండాది" ఆడి కళ్ళల్లో కళ్ళుకలుపుతూ అంటాది రంగి.

"సెందురుడికి నాలుగు తగిలించి శేవణంలోకి లగెట్టరా అని ఎప్పుడో సెప్పాలి." దాని బుగ్గలు సిదుముతూ అంటాడు ఆడు.

"సీకటి పడింది మాఁవా ! అయ్య ఎదురు సూత్తుంటాడు." ఆడి రెండు సేతులూ రెండు తాచు బాపుల్లా తన మెడ సుట్టూ మెలెట్టుకొని ఆడి మెడపై గడ్డంతో రాస్తూ గారాలు పోతాది రంగి.

"కాళ్ళు పీకుతున్నాయి మాఁవా !" అంటేసాలు అది ఎంత ఒద్దన్నా దాని కాళ్ళు ఆడి ఒడిలో పెట్టుకొని నొప్పులు తీరేదాకా నొక్కుతాడు.

ఓ రోజు రంగి కనిపించక పోతే ఆడి పేణం విలవిల్లాడి పోద్ది. దాని గుడిసెకు పరిగెడతాడు. కళ్ళనిండా దాన్ని సూసి అది అందించిన సల్లటి తరవాణి కడుపునిండా తాగి "ఒత్తానే రంగీ యియ్యాల రాకపోయినావో...."

"నేదు మాఁవా ! తప్పక యియ్యాల ఏగిరం వస్తాను" అంటాది ఆడు ఎల్ల లేక ఎల్ల లేక ఎల్లి పోతాడు.

ఆల్లకి లోకంతో పనిలేదు. ఆల్లే లోకం. ఆ లిద్దరే లోకం. ఆ రోజు....

ఆడికి బాగా గురుతుంది....

సూరీడు కొండల్లో నిద్దర పోవడానికి ఎల్లి పోతన్నాడు. రంగి కనిపించి ఆయేలకి రెండో రోజు. ఆడింక ఓపలేక పోయాడు. దాని పల్లెకి బయల్దేరాడు.

"ఏటోరా సిన్నోడా ! దానొంటినిండా సెవరకాయల్లాగా లేసినాదిరా నిన్న. కాని యియ్యాల అయి సెవరకాయలు కావని అమ్మోరు జల్లిందని ఎల్లమ్మత్త సెబుతున్నదిరా...." గొంతులో దుఃఖాన్నెలాగో మింగుకొని కళ్ళు తుడుసుకొని సెప్పాడు రంగి అయ్య.

ఆడు తుళ్ళిపడ్డాడు. "అమ్మోరా ?" అని అదిరి పడ్డాడు. ఆడి కేదో భయం దెయ్యంలా పట్టుకొంది. పరుగు పరుగున దాని మంచం దగ్గరికి లగెత్తాడు.

రొండు రోజులకే సగమై పోయింది రంగి. కళ్ళు లోతుకి పోయినాయి. బుగ్గలు పీక్కు పోయినాయి. జుత్తు ఎండిపోయి సిక్కులు కట్టేసింది. మంచంమీద బల్లిలా కరుసుకొని పడుకుంది రంగి.

ఆడు దాని ప్రక్కనే కూసున్నాడు. ఆడికి మాట పెగల లేదు. తగ్గిపోగానే అమ్మోరికి గొప్పగా సంబరం సేస్తాను అని మొక్కుకున్నాడు. ఆంజనేయులోరికి కొబ్బరి కాయలు కొడతానని మనసులో అనుకుంటున్నాడు.

అంతలోనే ఆడికెంతో నీరసం వచ్చేసింది. మెల్లగా దాని నుదురు మీదున్న సెవట తుడుస్తూ 'రంగీ' అని పిలిసాడు. ఆగొంతు దానికి అది ఎలాంటి స్థితిలో ఉన్నా తీయగా యినిపిస్తుంది.

"మాఁవా !" దాని కళ్ళల్లో కోటి మెరుపులు మెరిసాయి. "నాకేం బయం లేదు మాఁవా! నివ్వెందుకలా గాబరా పడి పోతావ్. అరె! పిరికోడివన్న మాట !" ఆడి సేతులు తనగుండెల కదుము కుని ఆడి పైపు దీనంగా సూస్తూ అంది.

"రంగీ...." ఆడు బావురమన్నాడు. "స ! ఊర్కో. నాఁకేమయింది. ఓరయ్యా....నీయల్లుడు నీకంటే పిరికోడు." ఆళ్ళకి దవిర్యం సెప్పడానికి పెయత్నించింది రంగి.

"ఓరోరె! ఇదేవి సోయిద్దం. తల్లి మాతల్లీ జల్లినోరికి అంతదగ్గరగా కూకో కూడదర్రా. ఆతల్లికి కోపం వత్తాది. లెండెహె!" అని యిన్ని ఏపరొడ్లు తెచ్చి రంగిని సిదగ్గొడ్డం మొదలెట్టింది పొరిగింటి యలమ్మ.

సిన్నిగాడికి ఆ ఏపకొమ్మలు తీసికొని ఆ ముసలమ్మను మొత్తెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఏప దెబ్బలు తిన్న రంగి

నిస్సత్తుగ కళ్లు మూసుకొంది. "మాఁవా! నువ్వెల్లకు... " ఆడికి యినిపించేట్టుగా మెల్లగా అంది ఆడుదాని పక్కనే కూసున్నాడు

రొండు.. మూడు.. ఏడు రోజులయిపోనాయి రంగికి తగ్గలేదు... ఆడు ఆడి గుడిసెకెళ్లలేదు. పచ్చిగంగ ముట్టలేదు రంగి అడపా తడపా కళ్లు తెరచి "మాఁవా! ఉన్నావా" అని చేతులు తన సేతుల్లోనికి తీసికొని మల్లా కళ్లు మూసుకొంటాది ఆడి పేనాన్నిఎవరో పిండుతున్నట్లు ఆడు గిజగిజలాడిపోతాడు

" మావా! నాను సచ్చిపోతాను " అంతవరకు దవిర్యంగా మాటలాడిన రంగి ఆ మాటలు అన్నప్పుడు గుడిసె గోడుగోడున ఏడి[illegible] ఆడి సంగతి సరే సరి.

[illegible] పెంటలు గోరూ రంగిని సూడ్డానికొచ్చారు "ఒరే! చిన్నోడా! [illegible] మసూచి అంటారురా? దీనికి ఇంజక్షన్లు యిప్పించితే, మంచి వైద్యం [illegible]స్తే తగ్గిపోతుందిరా!" అని సలహా యిచ్చాడు.

"సూదిమందా? అమ్మోరు జల్లినోళ్ళు సూదిమందా" ఆ వార్త గూడెం అంతా ఎంటనే ఎల్లిపోయింది

"ఆడు దవిర్యం సేస్తున్నాడు.. "

"అమ్మోరి సంగతి ఆడికితెలీదు... "

"ఎవడైనా మందిప్పించు కుంటాడా? " అని శాలామంది అనుకొన్నారు. గూడెం పెద్దలు సమావేశమయ్యారు

"ఆ సిన్నిగాడు ఆడిరంగికి సూ[illegible] మందిప్పించడం కాదు. అలా జరిగితే అమ్మోరికి కోపం ఎత్తాది. మనం పెద్దోల్లం అయి ఉండి యిలా జరుగుతుంటే ఊరుకున్నందుకు ఆ తల్లికి కోపం వత్తాది. మనల్ని మన పిల్లల్ని దుంపనాశనం సేసేత్తాది. ఈల్లేదు. దానికి మందు యిప్పించడానికీల్లేదు. రండెహె.. ఆ సంగతి తేలుసుకొందాం" పెద్దలా విధంగా ఒకమాట మీదకొచ్చారు.

ఊరు ఊరంతా ఆళగుడిసె ముందుకొచ్చారు. సిన్నిగాడికి తల తిరిగి పోయింది." ఇదేటి యిడ్డూరం. నారంగికి సరితగా ఉన్నప్పుడు ఎవరూ సూన్నానికి రాలేదు. వొయిద్యం సేయించు కొందావంటే ఆళంతాఅడొగొత్తున్నారు?" అనేమాట ఆళతోఅన్నాడు.

జనంలో కలకలం మొదలయింది, ఓముసల్దాయి ఆజనం లోంచి బయటకొచ్చింది. పూనకం పండింది. "ఓలమ్మో అమ్మోరు వోలింది... దూపం ఏయించండి....తల్లీ .. మాతల్లీ.. శాంతించు తల్లీ ... రంగికి సూదిమందిప్పించం తల్లీ.. నీసంబరం బాగా సేత్తాం తల్లీ... "ఊరు పెద్దలంతా ఊగి పోతున్నారు. ఆపూనకం పడ్డాముసిల్దాయి ఊగి పోతున్నాది. సిన్నిగాడి దగ్గరగా వొచ్చి నాది.....ఆడి వైపు ఉరిమురిమి సూసినాది.

"ఓరిసిన్నోడా?... నీకు కళ్లు పైకొచ్చినాయిరా సిన్నోడా! నానంటే ఓరసుకున్నావురోరిసిన్నోడా! సూది మందిప్పిస్తావు రోరిసిన్నోడా ! ఓ సూపు సూడాలేటిరా సిన్నోడో! నిన్ను దుంపనాసనం సేసెస్తానురా సిన్నోడా...." పూనకం పడ్డా మనిషి సిన్నోడికిశాపనార్థాలు తీస్తోంది, ఊరి పెద్దలంతా ఆ అమ్మ తల్లి శాంతించే పెయత్నాలు సేత్తన్నారు

సిన్నోడి కళ్లలో నీళ్లు తిరిగినాయి..

రంగికి సెయితన్యం లేదు. వారం రోజులుగా కళ్లుతెరవ లేదు. మంచానికి అంటుకు పోయింది

సిన్నిగాడు గుడిసె బయట నుంచి దాని మంచందగ్గర కెళ్లి దాని ప్రక్కన కూచున్నాడు.

అప్పటికే రంగికి తెలివొచ్చింది.. గుడిసె పైకప్పు వొంక సూత్తొంది... "మాఁవా!" మెల్లగా పిలిసింది, ఆడు తుల్లిపడ్డాడు. "రంగీ నీకు తెలివొచ్చిందా.. " ఆడి ఆనందానికి అంతులేదు. దాని కళ్లు ముద్దెట్టుకున్నాడు. కాళ్లు ముద్దెట్టుకున్నాడు. ఒల్లంతా ముద్దెట్టుకున్నాడు. ఆనందంతో ఊగిపోతున్నాడు ఆ సంగతి బయటోల్లకి సెప్పడానికి లేసాడు

రంగి, ఆడికి లెగొద్దని సైగచేసింది. కూసోమంది. ఆడి సేతులు తీసికొని కల్లపై పెట్టుకుంది. "మాఁవా! నాదో సిన్న కోరిక...."

"ఏటిరంగీ సెప్పు?" ఆడు ఆతురతగా అడిగాడు

"పెమాణం [illegible] చెయిలో చేయివేయించుకొంది. "మాఁవా!నువ[illegible]వ్వ....నన్ను మ....రి....సి....పో... వుకదా?" "[illegible]", ఆడు బావురుమన్నాడు. "నువ్వు లేకపోతే నేను సచ్చి పోతాను" అన్నాడు. అది ఆడినోరు మూసింది.

"మాఁవా! నువ్వు బదకాలి... నూరేల్లు బదకాలి... నాకోసం బదకాలి....నా కోరిక తీరసాలి...నువ్వు మల్లి పెల్లి చేసుకోకూడదు. బదికున్నన్నాళ్లు రోజూ నన్ను తలుసుకోవాలి...రావులోరి కొండపై రోజూ పాటలు పాడాలి. నేను సచ్చిపోతున్నాను. అదిగో... మా...వా...నాకెవరో పిలు స్తున్నారు . నానుపో....తు... న్నా.... ను .. నన్ను మరిసి...పోకు.. మా.. వా... నువ్వు నాకోసం... బదకాలి.. "

"రంగీ"... బావురుమన్నాడు ఆడు. గూడెం ఏడిసింది. బయట జనం ఏడిసారు.. ఏదీ సూడకుండ రంగి ఎల్లిపోయింది... అందర్నీ యిడిసి వెళ్ళిపోయింది.

ఆ యిదంగా రంగి సచ్చిపోయింది....

ఆడిని యిడిసి ఎల్లిపోయింది....

ఆడెంతో ఏడిశాడు.. సెరువుగట్టుమీద సిన్న మంటపం కట్టించాడు. అక్కడ రోజూ దీపం పెడతాడు. రంగి పేరుమీదుగా పిల్లలందరికీ పప్పు బెల్లం అప్పుడప్పుడూ పెడుతుంటాడు. జాబ్మని వొరసం కురిసే వేళకూడ ఆ మంటపం దగ్గర కూకొని సిన్నప్పటి సింతతోట సంగతులు తలుసుకుంటాడు.

సూరీడు పడమటి కొండల్లో కుంకుతున్నయేల సన్నగా ఎంకి పాటలు పాడుతుంటాడు...

అదంతా ఆడికి గురుతుంది. అయ్యన్నీ ఈయేల గుర్తొచ్చింది.

తెల్లటి పొడుగాటి గడ్డంపైనుండి జారిన ఆడి కన్నీళ్ళు భూదేవికి తలంటి నీళ్ళయింది....

సుట్టూ ఆడపిల్లలు, మొగ పిల్లలు తెల్లగన్నేరు పచ్చగన్నేరు పూలదండలు తెచ్చి నిలుసున్నారు....

ఆడు దూరంగా సూత్తున్నాడు . సీతమ్మ సెరువు అలాగే ఉంది....ఎదరగా సీతతోపు అలాగే ఉంది. పక్కనే రావులోరి కొండ అలాగే ఉంది... కుంకిపోతున్న సూరీడు అలాగే ఉన్నాడు. ఎంకి పాటలు అలాగే ఉన్నాయి....

కాని ఆ మడుసులు తీరు, రొండుతరాలు మారినయ్. 'రంగి' మామూలు రంగే వాళ్ళకి....ఆళ్ళు దాని పేనం తీసినారు. మూఢనమ్మకాలకి రంగిపానం బలైపోయింది. సూది మందిప్పిత్తే యింత అన్నాయం జరక్కపోయేది. ఈ తరంటోల్లకి రంగి దేవత....

ఓ నాలుగేళ్ళపిల్ల ఆడి బుగ్గలు గడ్డాం తుడిసి "ఎందు కేడుత్తున్నావు తాతా?...." అని చిలుక పలుకులు పలికితే ఆడు రంగిలా నవ్వుతాడు....

"నా నేడువలేదు... నా దేవతకు తలుసు కుంటుంటే నాకలానే నీళ్లొత్తాయి.. " అని ఆ పిల్లను ముద్దుపెట్టుకొని అందరికీ తలా కొంచెం పప్పు బెల్లం పెట్టాడు.

తెలీనోల్లు "ఎవరా దేవతా?" అని అడిగితే, "నా రంగి" అని గొప్ప గరవంగా సెబుతాడు.

తెలిసినోల్లు కూడా "నీ దేవతా ? నిజంగా నీకు అవుపడు తుందా?" అంటే....

"కనిపిస్తుందర్రా.... నా రంగి.... నా రాగం యినడానికి రోజూ వత్తాది. నా ఒడిలో పడుకుంటాది... కన్నీల్లు తుడుత్తాది. నాతో తనూ పాడతాదిరా నాగన్నల్రారా...." అంటాడు నిండా నూరేళ్లు నిండిన సిన్నిగాడు ఎక్కడోఉన్న రంగిని ఆడిలో ఉన్నట్టు తలుసుకుంటూ. *

---

# పులీ—మేకా

చూడండీ ! అటు చూడండీ
నా కన్నుల కన్నులు కలిపీ
కన్నులారగా పల్లె ప్రాంతముల చూడండీ !
పాడండీ యిక పాడండీ
నా గొంతున గొంతులు కలిపీ
ప్రగతి పాటలను హాయి మీరగా పాడండీ !

వెన్నె ముకను అంటిన కడుపులు
ఎగ బ్రాకగనుంకిస్తున్నవి
చీకట్లో కుమిలే బ్రతుకులు
వెలుగంటే తెలిసికొన్నవి
పాతాళములో పారెడుగంగ
పరవశమ్మున పైకొస్తున్నది
చూడండీ! అటు చూడండీ !
నా కన్నుల కన్నులు కలిపీ
కన్నులారగా పల్లె ప్రాంతముల చూడండీ !

చెట్టు క్రిందను చుట్ట కాల్చుతూ
మంచము మీద మేను వాల్చిన మొనగాడూ
చెండ్ర నిప్పులు చెరిగే యెండను
పొలమున నిలిచి హలమును బట్టీ
కొండ్ర వేసెడి కూలీడూ
మిట్టా పల్లం - మిట్టా పల్లం
తరతరాలుగా మిట్టా పల్లం !
మిట్టా పల్లం యేక మయినదీ
ఈ తరమున సాధించిన ఫలితం

చూడండీ అటు చూడండీ
నా కన్నుల కన్నులు కలిపీ
కన్నులారగా పల్లె ప్రాంతముల చూడండీ!

జనుడంటే పులియనుకొంటే
హరిజనుడే మేకయినాడూ !
తాతలనాటిది ఈ సంబంధం
వాతరోగమున వర్ధిలుచుండగ
వాటము జూచి వాతలు బెట్టితె
పులి మేకలు మూతులు కలిపీ
ఒక రేవున నీళ్లు త్రాగినవి-
చూడండీ అటు చూడండీ
నా కన్నుల కన్నులు కలిపీ
కన్నులారగా పల్లె ప్రాంతముల చూడండీ !

ప్రొద్దు పొడుపుతో నిద్దురలేచి
దోనెడు చద్దికి దేహీయంటూ
కలిగిన వాళ్ళ యింటి ముంగిటా
కళ్ళాపులు చల్లె హరిజన బాలిక
తన గుడిసె ముంగిటే తన్మయ మందుచు
ముచ్చట గొలిపే ముగ్గులు తీర్చగ-
జడలో తురిమిన మల్లెలూ !
జరీపావడా కుచ్చెళ్ళూ !!
గలగల గలగల నవ్వినవీ
నవ్వుచు నిన్నటు చూడమన్నవీ !
చూడండీ ! అటు చూడండీ !
నా కన్నుల కన్నులు కలిపీ
కన్నులారగా పల్లె ప్రాంతముల చూడండీ !

—శ్రీ పులికంటి కృష్ణారెడ్డి



# సిరిసిల్ల సహకార విద్యుత్సరఫరా సంఘం

—శ్రీ ఎన్. ఎస్. నారాయణరావు

కరీంనగర్ జిల్లాలోని సిరిసిల్లలో పని చేస్తున్న సహకార విద్యుత్సరఫరా సంఘం మార్చి 31 నాటికి ఏడు సంవత్సరాలు పూర్తి చేసి పెక్కు విజయాలు సాధించగలిగింది. ప్రాజెక్టు నివేదికలో పేర్కొనబడిన లక్ష్యాలను పూర్తిగా సాధించడమేగాక, నిర్ణయించిన లక్ష్యాలకన్న 11.2% అధిక్యతను సాధించింది.

## మినీ ఎలక్ట్రిసిటీ బోర్డు

సిరిసిల్ల సహకార విద్యుత్సరఫరా సంఘం 1970 నవంబరు నుండి పని చేయడం ప్రారంభించింది. ఈ సహకారసంస్థ ద్వారా సిరిసిల్ల తాలూకాలో గ్రామీణ సహకార విద్యుదీకరణ ప్రాజెక్టును అమలు చేశారు. కేంద్రప్రభుత్వం ఆధ్వర్యం క్రింద క్రొత్తఢిల్లీలోని గ్రామీణ విద్యుదీకరణ సంస్థ ఆర్థిక సహకారంతో రాష్ట్రప్రభుత్వం హామీతో ఈ ప్రాజెక్టును చేపట్టడం జరిగింది. సిరిసిల్ల తాలూకాకు విద్యుత్సరఫరా చేయడమే దీని ముఖ్య ఉద్దేశం. ఈ తాలూకాలో ఇది ఒక మినీ ఎలెక్ట్రిసిటీబోర్డుకు మల్లే పని చేస్తోంది.

తొలి ప్రాజెక్ నివేదికలో తాలూకా విద్యుదీకరణకై రూ. 295.94 లక్షలు సూచించారు. కాని వస్తువుల ధరలు పెరిగిపోవడం మూలాన రూ. 378.21 లక్షల పెట్టుబడితో రివైజ్డ్ ప్రాజెక్టు రిపోర్టును గ్రామీణ విద్యుదీకరణ సంస్థ మంజూరుచేసింది.

ఈ సంఘంలో మొత్తం 19048 మంది సభ్యులు. మొత్తం రూ. 23.50 లక్షల వాటా ధనం వుంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ బోర్డువద్ద నుండి ఏడు సంవత్సరాలక్రితం విద్యుత్సరఫరా సిస్టం కొన్నారు. అప్పట్లో సిరిసిల్ల తాలూకాలోని 46 గ్రామాలకు మాత్రమే విద్యుత్సరఫరా ఉండేది. మొత్తం ట్రాన్స్‌ఫార్మర్ల సంఖ్య 109; విద్యుత్ సెక్షన్లు 4720; ఇందులో వ్యవసాయ సర్వీస్ కనెక్షన్లు 2299.

ఆ సమయంలో 196 కి.మీ. 11 కె.వి.లైన్లు; 461 కి. మీ. ఎల్.టి.లైన్లు ఉంటూ 7.5 మెగవాట్ల కనెక్టెడ్‌లోడ్ ఉండేది.

సంస్థ కృషివల్ల 1970 నవంబరు నుండి 1977 మార్చి వరకు సిరిసిల్ల తాలూకా మంచి అభివృద్ధి సాధించగలిగింది. 15404 క్రొత్త కనెక్షన్లు, 415 ట్రాన్స్‌ఫార్మర్లు నెలకొల్పడం జరిగింది. 603 కి.మీ. 11 కె.వి.లైన్లు ; 1600 కి. మీ. ఎల్.టి. లైన్లు ఇస్తూ ప్రస్తుతం 33 మెగవాట్ల కనెక్టెడ్ లోడ్‌ను ఈ ప్రాంతంలో అందచేయగలిగారు.

ప్రస్తుతం సిరిసిల్ల తాలూకాలో 1185 వ్యవసాయ పంపుసెట్లకు విద్యుత్సరఫరా కనెక్షన్లు అందచేశారు. మొత్తం 20124 కనెక్షన్లు ఉన్నవి. తాలూకాలోని మొత్తం 173 గ్రామాలకు మార్చి 1975 చివరినాటికే విద్యుత్సరఫరా అందచేసే పని పూర్తి చేశారు.

1975-76 లెక్కల ప్రకారం తాలూకాలో తలసరి విద్యుత్ వాడకం 71.2 యూనిట్లు. 1976-77లో 91.90 యూనిట్ల స్థాయికి చేరుకోగలిగింది.

సంస్థ సహాయార్థం తాలూకా ప్రజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి విద్యుత్పరికరాలు, స్తంభాలు, తీగెలు మున్నగు వాటిని స్టోర్స్ నుండి పనిచేయు స్థలమువరకు స్వంతఖర్చుతో ఎడ్లబండ్లలో తరలించి, గోతులు త్రవ్వి, తీగలను లాగి, శ్రమదానం

చేశారు. ఈ ముమ్మర ప్రజాసహకార శ్రమదానం విలువ రూ. 15 లక్షలకు మించిందని అంచనా వేశారు.

సిరిసిల్ల సమీపంలోనున్న శాంతినగర్‌లో 1976 మే నెలలో సికింద్రాబాద్‌కు చెందిన సెయింట్ ఫ్రాన్సిస్ కళాశాల విద్యార్థినులు అఖిలభారత కేథలిక్ విశ్వవిద్యాలయాల సమాఖ్య, జాతీయ సేవా పథకం సంయుక్త ఆధ్వర్యంలో పది రోజులపాటు శిబిరం నిర్వహించినప్పుడు ఆ గ్రామంలో విద్యుత్ స్తంభాలు పాతుటకై గోతులు త్రవ్వడం, తీగలు లాగడం మున్నగువాటికై శ్రమదానం చేశారు. వారున్న పది రోజుల్లోనే ఆ గ్రామానికి విద్యుత్సరఫరాకు ప్రారంభోత్సవం జరిగింది. ప్రజల సహకారం సంస్థ పనులకు మరింత వేగాన్ని చేకూర్చగలిగింది. ఈ సంస్థ ఆర్థిక పరిస్థితి కూడా చాలా బాగా ఉంది.

ఈ సంస్థ లైనులపై విద్యుత్ నష్టముకాని ట్రాన్స్‌ఫార్మర్ల ఫేల్యూర్లు (Failures) కాని అంతగా లేవు, ఇక్కడ ఇదో విశేషం. లైనులపై విద్యుత్ నష్టమును 29.5% నుండి 22% వరకు తగ్గించడం జరిగింది. అదేవిధంగా ట్రాన్స్‌ఫార్మర్లు ఫేల్ అవడం కూడా 8.9% నుండి 2.8% వరకు తగ్గింది. అదనంగా ఆరు సబ్ స్టేషన్లు నెలకొల్పడం ద్వారానూ, ఫ్లయింగ్ స్క్వాడ్‌చే తరచుగా అకస్మాత్ తనిఖీలు జరుపడం ద్వారానూ, సరఫరా లోపాలను అక్కడికక్కడే అరికట్టడం ద్వారాను విద్యుత్తు నష్టంలో తగ్గుదల కన్పించింది.

ఈ సంస్థ మరోపని కూడ విజయవంతంగా చేపట్టింది. అది కొడుమంజ గ్రామంలో సామూహిక గోబర్ గ్యాస్‌ప్లాంట్ నిర్మాణం. ఈ ప్రయోగాత్మక గోబర్‌గ్యాస్ ప్లాంట్‌ను కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసర్చ్‌వారి సాంకేతిక సహకారంతోనూ గ్రామీణ విద్యుదీకరణ సంస్థవారి ఆర్థిక సహాయంతోను, చేపట్టారు. దీని నిర్మాణానికి లక్ష రూపాయలు వ్యయమౌతుందని అంచనా. ఇది పూర్తి అయితే కొడుమంజ గ్రామంలోని 60 కుటుంబాలకు వంటకవసరమున్న గ్యాస్ లభించుటయేకాక, వారి పొలాలకు బలమైన ఎరువుకూడా లభ్యంకాగలదు. ఈ ప్లాంట్ నిర్మాణం చివరి దశలో ఉంది.

ఈ సంస్థ సరఫరాచేసే విద్యుచ్ఛక్తి 85% వ్యవసాయ పంపుసెట్లకే వినియోగిస్తున్నారు. ఇతర రంగాల్లో ముఖ్యంగా పరిశ్రమల్లో దీని వాడకం ఈ ప్రాంతంలో అంతగాలేదు. సిరిసిల్ల తాలూకాలో ఇప్పుడు ప్రతీ గ్రామంలోనూ విద్యుత్సరఫరా ఉంది. స్థానిక ముడిపదార్థాలనుపయోగించిగాని, వ్యవసాయ ప్రాతిపదికపైగాని పెద్ద పెట్టున పరిశ్రమల స్థాపనకు ఆలోచనలు జరపడం అవసరం. ఈ తాలూకాకు ఉజ్వల భవిష్యత్తున్నదనడంలో సందేహం లేదు.

***



అమలాపురం ఎస్ కె బి ఆర్. కళాశాలకు భూరి విరాళం యిచ్చిన కీ. శే. భానోజీ రామర్స్ చిత్రపటాన్ని ఏప్రిల్ 16 న కళాశాల పాలకవర్గం అధ్యక్షులు శ్రీ నడింపల్లి రామభద్రరాజుగారు కళాశాలలో ఆవిష్కరించారు.



ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ ఎం.ఆర్ అప్పారావు ఏప్రెల్ 16 న అమలాపురం ఎస్ కె బి ఆర్ · కళాశాలలో ప్రముఖ కవి శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు రచించిన "పారిజాతము" నవలను స్వీకరిస్తున్న దృశ్యం.

సీరియల్ :

# మహాభారతము

తెలగంటుల లక్ష్మణశాస్త్రి

## అరణ్యపర్వం

## 107

జనమేజయా! యిట్లు అనేక విధముల వాపోవుచు ద్రౌపది భీమునితో మొరపెట్టుకొనుచు మరల నిట్లనెను.

"భీమసేనా! ఇప్పుడు నేను నీకు చెప్పబోవు నా దుఃఖవార్త యింకను ఘోరమైనది. అట్టి విషయము చెప్పి నీ మనస్సుకు కష్టము కలిగించుచున్నానని నాపై దోషము మోపకుము. దుఃఖముచే బాధపడుచు నేను అది యంతయు నీకు తెల్పుచున్నాను. నీకు సర్వదా అనర్హమైన వంటపని చేయుచున్నావు అది చాల నీచము నీవు 'బల్లవ' జాతిలో పుట్టిన వాడవని చెప్పికొనుట ఎవరికి శోకము కలిగించదు? నీవంటి వీరునికి సేవకత్వము వచ్చుటకంటె దుఃఖకరమైనది మరియేముండును? వంట సిద్ధమైన తరువాత నీవు విరాటరాజు వద్దకు పోయి ''మహారాజా! బల్లవుడు వంటవాడు మిమ్ము భోజనమునకు పిలుచుచున్నాడు' అని నీవు చెప్పునప్పుడు నా మనస్సు అతి దుఃఖితమగుచుండును. విరాటరాజు నిన్ను గజములతో పోరాడజేయుచున్నప్పుడు అంతఃపుర స్త్రీలు నవ్వుచుండగాజూచి నా మనస్సు వ్యాకులమగుచుండును సుదేష్ణ వినోదార్థమై శార్దూలములతోను, సింహములతోను నీవు పోరాడుచున్నప్పుడు, చాల బాధపడుచుందును.

నన్ను చూచి సుదేష్ణతన దాసీ జనముతో "సైరంధ్రి, బల్లవుడు, పూర్వము యుధిష్ఠిరునివద్ద ఒక చోట ఉండిన కారణముచేత కలిగిన స్నేహమువలన, మృగములతో యుద్ధముచేయుచున్న యా వంటలవానిని చూచి మనస్సులో మాటిమాటికి ఈమె దుఃఖించుచుండెను. ఈ సైరంధ్రియు అందమైనదే, బల్లవుడు సుందరుడే. స్త్రీల చిత్తము తెలిసికొనుట కఠినము. ఈ యిరువురకు ఈడు జోడు బాగున్నదనుకొనెదను ఈ వంటవానికి సింహగజాదులతో పోరాడవలసివచ్చినపుడు ఈమె అత్యంత దీనురాలై దుఃఖపూర్వకముగా మాట్లాడుచుండెను ఈ రాజగృహమునందు వీరిరువురూ ఒకేసారి వచ్చి కొలువులో చేరినారు కాబట్టి నా ఊహ దృఢమగుచున్నది" అని చెప్పి నన్ను సర్వదా గద్దించుచుండెను నీకును నాకును సంబంధమున్నట్లు శంకించి నన్ను కోపించుచుండెను

"నాథా! భీమ పరాక్రమముగల నీవు నరకతుల్యమైన యీ కష్టములనుభవించుచుండగా చూచి యుధిష్ఠిరుడును శోకించుచుండెను. మీ యిరువురనుచూచి నేను శోకమగ్నురాలనగుచుందును. నాకు జీవించుటకు యిచ్ఛ లేదు. ఏ వీరుడు దేవ మనుష్య లోకములలో ఏకరథుడై అసమాన విజయమును సాధించెనో అట్టి అర్జునుడు నేడు విరాట కన్యలకు నాట్యాచార్యుడుగా నున్నాడు. అతడు సామాన్య వీరుడా? ఖాండవ దహనము చేయించి అగ్నిదేవుని తృప్తిపరచెను. ఇప్పుడు అంతఃపురమునందు పడి నూతిలోని అగ్నివలె తేజోహీనుడయి క్రుంగుచున్నాడు. ఎవరిని చూచి శత్రువులు భయపడుచుందురో ఆ ధనంజయుడు లోకులకు అసహ్యకరమైన వేషములోనున్నాడు. ధనుస్సు నారి లాగుటచేత ఏర్పడిన కిణములతో ప్రకాశించుచు గడియ మ్రానులవలె బలిష్ఠములుగానున్న అర్జునుని బాహువులు శంఖముల గాజులతో నిండియుండుటజూచి దుఃఖమగుచున్నది. ఎవని ధనుష్టంకార ధ్వని విని శత్రువులు వణుకుచుందురో అట్టి విజయుని గీత ధ్వని విని యిప్పుడు స్త్రీలు వినోదించుచున్నారు. ఎవని శిరస్సుపైన సూర్యునివంటి కిరీటము శోభిల్లుచుండెనో అట్టి కిరీటి యిప్పుడు జడ వేసికొని వికార వేషములో నున్నాడు భయంకర ధనుర్ధారియైన అర్జునుని యిప్పుడు కన్యకలు జుట్టి యుండగాచూచి నా మనస్సు విషణ్ణమగుచున్నది ఏ వీరునకు సమస్త దివ్యాస్త్రములు అలంకారములై యుండునో ఎవడు సర్వ విద్యలకు ఆధారభూతుడో అతడిప్పుడు పేడిరూపములో కుండలములు ధరించియున్నాడు పొంగిన సముద్రము తీరమును లంఘించజాలనట్లే, యే వీరుని అసమాన పరాక్రమశాలురు గూడ ఆక్రమించుటకు ముందుకు రాజాలకుండిరో అట్టి అర్జునుడిప్పుడు విరాటరాజు కన్యలకు నృత్యమును నేర్పుచు ప్రచ్ఛన్న వేషములోను డికన్యలకు పరిచారకుడుగా నుండుటనుజూచి నా మనస్సు బాధపడుచున్నది.

"ఎవని రథఘోషచేత సమస్త భూమండలము కంపించెనో, ఎవడు పుట్టినప్పుడు కుంతీదేవి దుఃఖము నశించెనో అట్టి నీ తమ్ముడు అర్జునుని దుర్గతికి శోకించుచున్నాను. అతడు స్త్రీ జనోచి

తాభరణములు ధరించియుండగా జూచి నా హృదయము దుఃఖితమగు చుండును. అనేక దివ్యాస్త్రముల సంపదగలవాడై, నివాత కవచ కాలకేయాది రాక్షసులను సంహరించినవాడిపు డంతఃపురమునందు మరుగుపడియుండుటజూచి చాలా విచారపడుచున్నాను. గొప్ప కోడై గోశాలలో బంధింపబడినట్లు కన్యాంతఃపురములో స్త్రీ వేషమున నున్నాడే కొడుకులు యిట్లు దురవస్థపాలె నారని తెలిసినచో కుంతీదేవి యెట్లు దుఃఖించునో కదా !

"భీమసేనా ! గోవులలో గోపాలుని వేషములో తిరుగుచున్న సహదేవునిచూచి నా శరీరము నెత్తురు యెండిపోయి పీలగానగును. అతని అవస్థతలచుకొనుచున్న నాకు నిద్ర పట్టదు. ఇక సుఖ మెక్కడిది ? సహదేవుడు చేసిన పాపమేమి ? ఎందులకీ దురవస్థకు లోనైనాడు. రక్తవస్త్రములను ధరించి బానిసవలె చేతులు కట్టుకొని విరాటరాజువద్ద అతడు మాట్లాడుటచూచి, నాకు జ్వరము వచ్చినట్లు వేడి యెక్కెను. పూజ్యురాలైన కుంతీదేవి సర్వదా నావద్ద సహదేవుని విషయమై ప్రస్తావించుచు, అతడు శీలవంతుడు, సత్ప్రవర్తనుడు, అని మెచ్చుకొను చుండెను. మనము అరణ్యవాసమునకు బయలుదేరినప్పుడు కుంతీదేవి సహదేవుని అలింగనము చేసికొని యేడ్చుచు నాతో నిట్లనెను. 'ద్రౌపదీ ! సహదేవుడు లజ్జాశీలుడు, మధుర భాషణుడు, ధార్మికుడు, నాకు అత్యంత ప్రియుడు, అన్నలకు పరమ భక్తుడు, కష్టము సహించజాలడు, అడవిలో నడచు నప్పు డతనిచేయి పట్టుకొని తీసుకొనిపొమ్ము. స్వయముగా నీవు భోజనము తినిపించుము'. భీమసేనా ! ఆమెమాటలు నాకు యిప్పటికి జ్ఞప్తియందున్నవి. అట్టి సుకుమారుడు ఇప్పుడు గోసేవలో తత్పరుడై రాత్రివేళల దూడల చర్మముపైన శయనించు చుండుట చూచుచు ఎట్లు జీవించి యుండగలను ?

'ఎవడు రూపము, శస్త్రాస్త్ర సంపద—బుద్ధి కౌశలము ఈ మూడింటిచేత సర్వదా పరిపూర్ణుడో అట్టి నకులుడు నేడు విరాట రాజుకడ అశ్వసేవా కార్యమునందున్నాడు. కాల విపర్యాసము చూడుము. 'దామగ్రంథి' యను పేరుతో నున్న యా వీరుడిప్పుడు విరాటరాజు సమక్షము నందు అశ్వములకు శిక్షణము నిచ్చుచున్నాడు. విరాటునికడ వినయముతో గుర్రములను చూపించుచున్న నకులుని చూచి చాల బాధపడుచుండును. ఇక నాకు సుఖమెక్కడిది ? యుధిష్ఠిరుని మూలముగా అనేక దుఃఖము లనుభవించు చున్నాను. కుంతీపుత్రా ? ఇంతకన్న పెద్దదుఃఖమేమనగా, మీరు బ్రతికి యుండగానే నాకు వివిధములైన దుఃఖములు కలిగినవి. అవి నాశరీరమును శుష్కింప చేయుచున్నవి. ఇంతకన్న వేరు దుఃఖమేమున్నది ?' ఇట్లు చెప్పి ద్రౌపది తనకు కలిగిన యితర దుఃఖములను గూడా నిట్లు చెప్పదొడగెను.

'భీమసేనా ! నేను సైరంధ్రిగా నుండి సుదేష్ణకు ప్రతిదినము స్నాన సామగ్రిని సిద్ధముచేసి యిచ్చుచుందును. ఈ దుర్గతి నాకు జూదములో ధూర్తుడైన మీయన్నవలన కలిగినది. ఇట్టి దురవస్థను సహించుచు నేను దాని అంతమునకై యెదిరి చూచుచుందును. ఎందుకనగా, ప్రతి దుఃఖమునకు అంతముండును గదా ! మనుష్యులకు ధనాగమము, జయాపజయములు అనిత్యముగిదా యని తలచుచు నా భర్తల అభ్యుదయమునకై యెదిరి చూచుచున్నాను. అర్థములు, దుఃఖములు చక్రమువలె తిరుగుచుండును. పురుషుని అపజయమునకు ఏది హేతువో, అదియే అతని భయమునకు గూడ హేతువగునని ప్రతీక్షించుచున్నాను. ఈ దుఃఖముల తాకిడి చేత భీమసేనా, నేను మృతప్రాయురాలనుగా నుండుటను నీవు గమనించుటలేదా ?

"పురుషుడు లోకములో, ఒకప్పుడు దానము చేసినవాడే యాచించు దుర్గతికి లోనగును. అనేకులను చంపినవాడే ఒకప్పుడు తాను చంపబడును. ఇతరులను క్రింద పడగొట్టినవాడే ఒకప్పుడు ఇతరుల చేత పడగొట్టబడును" అని నేను వినినాను. కాబట్టి దైవమునకు దుష్కర కార్యమేదియు లేదు. దైవ విధిని లంఘించుట అసంభవము. కనుక, దైవ విధికి ప్రాధాన్యము నిచ్చు శాస్త్ర వాక్యములు విశ్వసించి నడచెదను. పూర్వము జలము నిండుగా ఉండి యెండిపోయిన చోటికే తిరిగి జలము చేరుచుండుట చూచుచున్నాము గదా ! నీతి పూర్వకముగా రక్షింపబడిన వస్తువును గూడ, దైవము ప్రతికూలమైనప్పుడు, ఆ దైవమే నశింప జేయును. అందుచేత విజ్ఞుడు, దైవమును అనుకూల పరచుకొనుటకు ప్రయత్నించవలెను. ఈ మాటలు చెప్పుటచేత యిప్పుడు ప్రయోజన మేమి ?' అని నీవు అడుగవచ్చును. దానికి బదులు చెప్పెదను వినుము.

"ద్రుపదరాజ పుత్రి, పాండవుల పట్టపు దేవియు నైన నేను యిట్టి దురవస్థ పాలైనాను. ఈ కష్టమునందు నేను గాబట్టి జీవించియున్నాను. మరి యొకతె జీవించ గోరునా ?

భీమసేనా ! నాకు గలిగిన యీ క్లేశము, సమస్త కౌరవులకు, పాంచాలురకు, పాండవులకు అవమానకరము గాదా ? సోదరులు, అత్తమామలు, పుత్రులు, మొదలైన పరివారము గలిగి అన్ని అభ్యుదయములను పొందిన స్త్రీ, నేను దప్ప మరి యెవతె యింత దుఃఖమననుభవించును? నేను బాల్యమునందు దైవము నెడల తప్పక అపరాధమేదో చేసియుందును. దాని చేతనే ఈ కష్టములు అనుభవించు చున్నాను.

"చూడుము నా శరీరకాంతి ఎట్లు తగ్గిపోయి ఎట్లు పీలగా అయిపోయినదో. ఈ దుర్గతి నాకు వనవాస సమయము నందు గూడ కలుగ లేదు. నేను పూర్వము అనుభవించిన సుఖమును నీ వెరుగుదువుగిదా ? అట్టి నేను ఇప్పుడు దాసీత్వమును పొంది శాంతి లేక బాధ పడుచున్నాను. ఇది దైవలీలగా నేను భావించుచున్నాను. లేకున్న మహా సమర్థుడైన అర్జునుడు గూడ నివురు గప్పిన నిప్పువలె నున్నాడు. ప్రాణులగతి తెలిసికొనుటకు శక్యము గాదు. మీకు గలిగిన యీయవమానమును చూచి యీ నిశ్చయమునకు వచ్చినాను. ఇంద్ర సమానులైన మీరు ఏ నాముఖమును గొప్పగా చూచుచుంటిరో అట్టి నేను ఇప్పుడు నాకంటె నీచురాండ్ర ముఖమును దైన్యముతో చూడవలసిన దుర్గతి పట్టినది. పాండవోత్తమా ! మీరు బ్రతికి యుండగా నాకీ అనర్హమైన గతి పట్టినది. ఎంతటి కాలవిపర్యయ మిది ? ఏ నాకు చతుస్సముద్ర ముద్రితమైన సమస్త భూమండలము వశవర్తి యైయుండెనో అట్టి నేను నేడు, సుదేష్ణకు భయపడుచు ఆమెకు వశవర్తినియై యున్నాను.

(తరువాయి 45వ పేజీలో)



పంచాయతీ కార్యాలయం

# మెట్టుపల్లి

—శ్రీ ఎం. నిజాముద్దీన్

కరీంనగర్ జిల్లా హుజురాబాద్ తాలూకా భీమదేవర పల్లి సమితిలోని 'మెట్టుపల్లి' గ్రామం జిల్లాలో ఉత్తమ గ్రామ పంచాయతీగా ఎంపిక అయింది. ఈ పల్లె ప్రజలు పరస్పర సహకార భావంతో కలిసి కట్టుగా వుండడమేగాక, రాజకీయ ప్రమేయాలకు దూరంగా వుండడం వల్ల గ్రామాభివృద్ధి కొట్టవచ్చినట్టు కనబడు తున్నది.

గ్రామ మొత్తం జనాభా నాలుగువేలు. 748 కుటుంబాలున్నాయి. 506 మంది షెడ్యూలు కులాల వారున్నారు. 1954 సంవత్సరంలో నాల్గవ తరగతి వరకు బోధించబడు పాఠశాల క్రమేణా ఉన్నత పాఠశాలగా రూపొందింది. విద్యార్థులసంఖ్య 310. ఇందులో 110 మంది హరిజన బాలబాలికలు చదువుకుంటున్నారు. విద్యావంతుల సంఖ్య ఏడొందలు. అక్షరాస్యతను పెంచే కార్యక్రమంలో భాగంగా 60 మంది వయోజనులకై ఒక రాత్రి పాఠశాలను ఏర్పాటు చేశారు. హైస్కూలులో తరగతి గదులకొరతను తీర్చుటకు 12 వేల రూ॥ విరాళాలు సేకరించి నాల్గుగదులు నిర్మించారు. యాభైమంది యువజనులు కలిసి "లాల్‌బహదూర్ యువజన సంఘం" నెల కొల్పారు. వీరుసాంస్కృతిక కార్యక్రమాలతో పాటు, గ్రామీణ, జిల్లా,తాలూకా, రాష్ట్రస్థాయి క్రీడోత్సవాలలో పాల్గొని బహుమతులు గెల్చుకున్నారు. ఒక పఠనాలయాన్ని స్థాపించుకున్నారు.

25 మంది సభ్యురాండ్రతో మహిళామండలిలో స్త్రీలకు కుట్టు, అల్లిక, ఎంబ్రాయిడరీ పనులలో శిక్షణ లభిస్తోంది.

గ్రామస్థులు విశాల పరపతి సంఘాన్నొకదాన్ని 1962 లో స్థాపించారు. సభ్యుల సంఖ్య 320. వ్యవసాయదారులు తమ అవసరానికి ఋణాలు తీసుకుంటున్నారు. సకాలంలో చెల్లించడంలో ఈ పల్లెవాసులు ఎప్పుడూ వెనకాడరు. ఈ సంవత్సరం ఎనిమిది లక్షల రూపాయలు రుణం పంపిణీ చేశారు.



సర్పంచ్
శ్రీ తుమ్మల శ్రీరాంరెడి

160 మంది చేనేత కార్మికులు, 300 స్త్రీలతో ఒకఖాదీ సహకార సంస్థను ఏర్పాటు చేసుకుని, ముతక ఖద్దరు, దోవతులు, నవారు, చీరెలు, జంపఖానాలు, తయారు చేస్తున్నారు. ఇటీవలే 2 కి.మీ మట్టిరోడ్డును గ్రామవాసులు శ్రమదానంతో వేశారు. దీనివిలువ కడితే ముప్పది ఐదువేల రూపాయలు ఖర్చు అయ్యేది.




యువకులైన గ్రామ సర్పంచ్ శ్రీ టి. శ్రీరాంరెడి మార్గ దర్శకత్వంలో "మెట్టుపల్లి" ఆదర్శమైన గ్రామ పంచాయతీగా ప్రశంస లందుకుంటున్నది. ఈ సంవత్సరం పన్నులు నూరు శాతం వసూలు చేయబడినవి. ఇరువది ఒక్క వేల రూ॥ లతో నూతన పంచాయతీ భవన నిర్మాణం చేశారు. ప్రభుత్వ నిధులతో 4 సామూహిక బావులు, పంచాయతీ నిధులతో 2 బావులు, హరిజన వాడలో 2 మంచి నీటి బావులు రక్షిత మంచి నీటి పథకం క్రింద త్రవ్వించారు. ప్రజావిరాళాలతో మెట్టుపల్లి-ఎరుకలగూడెం మధ్యన మట్టి రోడు కల్వర్టులు నిర్మించారు. రూ॥ 5 వేల సమితి నిధులుతో హరిజనవాడ రహదారిని మరమ్మత్తు చేయుటకు సంకల్పించారు. హరిజన విద్యార్థుల వసతి గృహనిర్మాణానికి పశువుల ఆస్పత్రికిగాను రెండు ఎకరాల భూమిని శ్రీయుతులు జగన్మోహన్‌రెడ్డి, వి. మొగిలయ్య, రాజమౌళి దానంగా యిచ్చారు. నాల్గువేల రూపాయలతో సామూహిక ఆరు బయలు సభా స్థలాన్ని ఏర్పాటు చేసుకున్నారు. 90 మంది బలహీనవర్గాల వారికి ఎక్‌సాల పట్టాలుయిచ్చారు. 83 మంది హరిజనులకు యిళ్ళ స్థలాలు పంపిణీ చేశారు

గ్రామం మొత్తం మీద 1454 ఎకరాల భూమి సాగుచేయ బడుతున్నది. 478 మంది రైతులు అధికదిగుబడి నిచ్చే వరివంగడా లను వాడి అధికోత్పత్తులను పొందుతున్నారు. ఈ వూర్లో 350 బావులుండగా వాటికి విద్యుత్ మోటార్లు, ఆయిల్ యింజన్లుఅమర్చ బడినవి.

ప్రగతి పథంలో పయనిస్తున్న ఈ గ్రామమును ఏ వాణిజ్య బ్యాంకు అయినా దత్తత తీసుకున్న పక్షంలో గ్రామం సమగ్రాభివృద్ధితో బాటు పూజ్య బాపూజీ కలలుగన్న గ్రామ స్వరాజ్యం ఏర్పడగలదని ఆశిద్దాం.

# ఈ సంచికలో రచయితలు

## శ్రీ యుతులు

జానమద్ది హనుమచ్ఛాస్త్రి, 1/508, గాంధీనగరం, కడప.

'పుష్యమి' శ్రీయస్. యస్. ప్రకాశరావు, సోమేశ్వర అగ్రహారం, పాలకొల్లు; పశ్చిమ గోదావరి జిల్లా.

'సుచంద్ర' శ్రీ యస్. చంద్ర శేఖర శాస్త్రి, తెలుగు శాఖాధి పతులు యస్. యస్. ఆర్. జె. కళాశాల, ఖమ్మం-3

యమ్. నిజాముద్దీన్, 'ఆంధ్రజ్యోతి' విలేఖరి, కరీంనగర్.

బలివాడ రామకృష్ణారావు, జెట్టివారి వీధి, పాలకొండ, శ్రీ కాకుళం జిల్లా.

కశింకోట ప్రభాకర్ దేవ్, 8-4-32; ట్రంకు రోడ్డు; శ్రీ కాకుళం.

పరిపాటి వేణుగోపాల్, తీర్థం, పలమనేరు తాలూకా, చిత్తూరు జిల్లా.

శ్రీమతి కె. రామలక్ష్మి 1. శివప్రకాశ మొదలి వీధి, మద్రాసు-17

నెల్లుట్ల మాణిక్యరావు, అరవింద సాంఘిక సేవాసంఘము, హైదరాబాదు.

పులికంటి కృష్ణారెడ్డి; ఎడిటరు; 'కామధేను' ; 68, జి.కార్ స్ట్రీట్; తిరుపతి.

కొడమంచిలి హెన్రీ, టి.పి.ఆర్.ఓ., ఖమ్మం.

ఎం. గోవిందయ్య, టి.పి.ఆర్.ఓ., ఉదయగిరి ఖమ్మంజిల్లా

డి. వి. ఎన్. అప్పారావు, టి.పి.ఆర్.ఓ. సత్తుపల్లి, ఖమ్మంజిల్లా.

ఎన్ ఎస్. నారాయణరావు, టి.పి.ఆర్.ఓ., సంగారెడ్డి, మెదక్‌జిల్లా.

బి.ఎన్. మూర్తి, ఎడిటర్, "యోజన," చిక్కడపల్లి, హైదరాబాదు.

మల్లిడి సత్తిరెడ్డి, రాష్ట్ర సమాచార కేంద్రం, విజయవాడ.

బి. బాలయ్య, టి పి.ఆర్.ఓ. వెంకటాపురం, ఖమ్మంజిల్లా.

"మంజుశ్రీ," తెలుగు అకాడమీ, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

విహారి, శాలివాహన, శ్రీజె.యస్. మూర్తి; 26/239, అరవ గూడెం, మచిలీపట్నం

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాద్-4

శ్రీమతి సి ఆనందారామం, 28సి, మారేడు పల్లి, సికింద్రాబాద్

కామరాజుగడ్డ రామచంద్రరావు, పి. జె. 47, పంజగుట్ట హైదరాబాద్

పులిచర్ల సాంబశివరావు, 17వ లైను, అరండల్ పేట, గుంటూరు.

ఉన్నవ మదనమోహనరావు 6-3-674/1, నారాయణ గూడా, హైదరాబాద్.

సిద్ధాని నాగభూషణం ఎ. పి. ఆర్. ఓ, సమాచార శాఖ, హైదరాబాద్

# ఆహార కల్తీ నిరోధక చట్టం

—శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

(గతసంచిక తరువాయి)

పెద్ద పెద్ద నేరాల సంగతి పైన చెప్పుకొన్నాం. వాటి విషయంలోనేరప్రక్రియా స్మృతిలో ఉన్న నిబంధనల ప్రకారం న్యాయస్థానాలు విచారణ జరిపి, సాక్ష్యం సందర్భం రికార్డు చేసుకొని పక్షకారుల వాగ్వాదాలు విని తీర్పులు వ్రాసి నిర్ణయం చెయ్యాలి.

కాని చిన్న చిన్న నేరాలు శతథా ఎప్పటికప్పుడు వస్తూ ఉంటవి. వాటిని ఒక సంక్షిప్త విచారణ చేసి నిర్ణయం చేయవచ్చు. అందులో నడపాల్సిన ప్రక్రియలో పెద్ద రికార్డు ఉండదు. చాలా తక్కువ రికార్డు ఉంటుంది. సమన్సు కేసులో ఎలాగో అలాటి ప్రక్రియను అనుసరిస్తారు. ఆ రికార్డు ఇంచుమించు ఒకే ప్రరూపంలో ఒకే కాగితం వుండచ్చు. దానిలో కేసు నంబరు, నేరంచేసిన తేదీ, ఫిర్యాది పేరు, అపరాధి పేరు, చేశాడని చెప్పిన అపరాధము, అందులో ఇమిడివున్న వస్తువుల విలువ, అపరాధి చేసే వాదములు ఏమి అనే విషయం వ్రాస్తారు. ఆ మీదట సాక్ష్యం వల్ల మేజిస్ట్రేటునకు తోచిన నిశ్చయం అందుమీద విధించిన శిక్ష, ఏనాడు ఈ కార్యక్రమం పూర్తి అయిందో ఆ తేదీ, ఇవన్నీ ఆ కాగితంలో వ్రాసి ఉంటవి. ఇంతే రికార్డు. ఎక్కువ కాలం ఆలస్యం కాకుండా చకాపికి కోర్టు పని తేలిపోతుంది.

అయితే ఈ ప్రక్రియ ప్రకారం చేసిన కేసుల్లో ఒక సంవత్సరం మించిన శిక్ష విధించటానికి వీల్లేదు.

ఈ కేసులను విచారించే అధికారం 1 క్లాసు మెజిస్ట్రేటుకూ, మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్లకు మాత్రమే ఉంటుంది.

'వారంటీ' ఇవ్వనందుకు, ఎవరిదగ్గరనుంచి సరకు తనకు వచ్చిందో చెప్పక పోయినందుకు చేయబడిన నేర విషయంలో ఏలాటి మంజూరీ లేకుండానే కోర్టులో అభియోగం తేవచ్చు. ఇంకా ఎవరైనా వ్యక్తి 12వ సెక్షను క్రింద, వస్తువును కొని, దానిని ఎవరి దగ్గరయితే కొన్నాడో అతడి సమక్షంలోనే తాను పబ్లిక్ ఎనలిస్టు దగ్గరకు పరిశీలనకు దానిని పంపుతున్నట్లు నోటీసు నిచ్చి అలా పంపి, నివేదిక వచ్చినమీదట దాని ఆధారంగా అభియోగం తెచ్చేటప్పుడు ఎలాంటి నేర విషయంలోనైనా ప్రత్యేక మంజూరీ యేమీ అక్కర్లేదు.

మిగతా సందర్భాల్లో మాత్రం కేంద్ర ప్రభుత్వం యొక్క లేదా రాష్ట్ర ప్రభుత్వం యొక్క మంజూరు పొంది మరీ అభియోగం కోర్టులో దాఖలు చెయ్యాలి.

కోర్టువారు అవసరమైతే ఆ ఆహారాన్ని ఉత్పత్తి చేసిన ఉత్పత్తిదారునూ, లేదా అపరాధికి అమ్మిన వానిని కూడా ఆ కార్యకలాపాలలో పక్షకారుగా చేర్చి సమాధానం చెప్పవలసిందని అనవచ్చు.

నేరప్రక్రియా స్మృతిలో 1 క్లాసు మెజిస్ట్రేటుకు రెండు సంవత్సరాల కారాగారవాసం కంటె ఎక్కువ శిక్ష విధించటానికి అవకాశం లేక పోయినా సరే–ఈ చట్ట నేర విషయంలో మాత్రం 6 సంవత్సరాల వరకూ కారాగారవాస శిక్ష విధించ వచ్చునని శాసించారు.

## కంపెనీలు అపరాధం చేస్తే ఎలా?

కంపెనీ ఇలాంటి అపరాధాలు చేసినప్పుడు ఆ వ్యవహారాలలో ప్రయేయము కలిగి బాధ్యతను వహించే ప్రతి ఒక్కడికి కూడ శిక్ష పడే అవకాశం ఉంది. కాని అందరికీ ఇలాటి చీకాకు తెప్పించటం కంటె కంపెనీలకు మరొక అవకాశం ఇవ్వటం మంచిదని 17 (2)వ సెక్షనులో ఒక్కొక్క కంపెనీ ఒక్కొక్క వ్యక్తిని వాళ్ల వాళ్ల డైరెక్టర్ల నుంచి గాని, మేనేజర్ల నుంచిగాని, ఈ ఆహార సంబంధమైన అపరాధాలు జరగకుండా చూచే బాధ్యత నిచ్చి నియమించి అతడి సమ్మతి కలిగిన అతడి జాబుతో సహా రికార్డు చేసి ఉంచటానికి యేర్పాటు చేశారు. ఒక కంపెనీకి ఎక్కువ శాఖలున్నట్లయితే ఒక్కొక్క శాఖకు ఒకొక్కడిని ఇందుకుగాను నియమించవచ్చును. అప్పుడు అతడొక్కడే ఈ నేరాల విషయంలో బాధ్యుడై ఉంటాడు. మళ్లీ ఆ ఉత్తరువు ఉపసంహారం చేసి ఇంకొకడిని వేసేవరకు–ఇదీ పరిస్థితి

అతడి నియామకం అలా ఉన్నా అతడితోపాటు కంపెనీ అధికారుల్లో ఇంకెవరైనా ఈ నేరం చేయటంలో పాల్గొని ఉన్నట్లయితే వాళ్లకూ శిక్ష తప్పదు. ఎవరెవరి మనస్థితుల్లో గల పరిస్థితిని బట్టి వారి వారికి ఉంటుందనే విషయం మరిచిపోకూడదు.

ఏ ఆహార పదార్ధ విషయంలో ఈ నేరాలు జరిగినాయో ఆ ఆహార పదార్థం ప్రభుత్వ పరం చేస్తారు. ప్రభుత్వం వాటిని అధిహరణ చేస్తారు అని అర్థం. వారు ఆ చెడు పదార్థాన్ని బాగు చేయటానికి వీలయితే చేస్తారు. లేకపోతే నాశనం చేస్తారు అలా గాక అది బాగుచేయటానికిగాను, అది ఎవరి దగ్గరనుంచి పట్టుకొన్నారో అతడి దగ్గర హామీ పుచ్చుకొని అతడికి ఇవ్వటం కూడా సంభవం.

కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం కూడ, తమకు చెందినట్టి విషయాల్లో ఈ చట్టం క్రింద నియమాలు చేయవచ్చు.

## కల్తీ సంగతి తెలీదని తప్పించు కోటానికి వీల్లేదు

ఒక కల్తీ ఆహారాన్ని అమ్మిన మీదట, తగిన ముద్రతో ఉన్న ఆహారాన్ని అమ్మిన మీదట, అది అలా కల్తీదనిగాని తగిన ముద్రతో ఉన్నదని గాని తనకు తెలీదనే వాదాన్ని అపరాధి చేయటానికి కోర్టు అనుమతించదు.




మరి నిజంగా తెలీదుగదా ఇదేం న్యాయం అనచ్చు ఇందులో ఒక విశేషమైన పరమార్థమున్నది. ఈ మాత్రపు వాదం ఎవరైనా ప్రవేశపెట్టేదే అతడికి తెలుసును అనే సంగతి కేసు పెట్టినవారు రుజువు చేస్తే తప్ప–ఆ వాదం పెట్టి ఎవరైనా తప్పించుకొని పోయే అవకాశం ఎంతో వుంది దానివల్ల అపరాధి తేలికగా తప్పించుకొనటం, శాసనోద్దేశం వ్యర్థమై సమాజానికి హాని వాటిల్లటం తథ్యం. "నాకు తెలీదు" అనే విషయార్థాన్ని రుజువు చేయటం అనే ప్రసక్తి లేదు గదా ! నాకు ఫలాని విషయం తెలుసు అనే విషయార్థాన్నే రుజువు చేయటమంటూ ఉంటుంది నాకు తెలీదనే మాట చెప్తే చాలు. ఈ వీలు దుర్మార్గంగా నడిచే వారికి ఇవ్వటం సమాజానికి హాని కలిగించటమే. అందుకని ఈ వాదం అపరాధికి లేదన్నారు. వ్యక్తి రక్షణ ఒకప్రక్క, సమాజ రక్షణ ఇంకోప్రక్క ఉన్నప్పుడు సమాజ రక్షణకే ప్రాధాన్యమివ్వాలనే సూత్రం సంస్మరణీయం.

## నిరపరాధుల రక్షణ

కాని, అమ్మకందారు తను అమ్మిన ఆ ఆహార పదార్థం ఫలాని వాని దగ్గర కొని తెచ్చినట్లు చెప్పి, ఒకవేళ అది లైసెన్సుదారు వద్దనే కొనవలసి ఉన్నట్లయితే అలాంటి వాడి దగ్గరనే తాను కొన్నట్లు రుజువు చేసి, పైగా అలా తెచ్చిన పదార్థం తగిన విధంగా తన ఆధీనంలో జాగ్రత్తతో ఉంచి ఏ స్థితిలో అది తన వద్దకు ఆ స్థితిలోనే తాను అమ్మినాడు అని రుజువు చేసినట్లయితే, అప్పుడు అతడు కల్తీ ఆహారం అమ్మిన నేరాన్ని గాని తగని ముద్రతో గల ఆహార వస్తువును అమ్మిన నేరాన్ని గాని చేసిన వాడుగా భావించరాదు అని 19 వ సెక్షన్‌లో ఉన్నది.

అలాగే, కంపెనీపై దాఖలు చేయబడిన కేసుల్లో, అపరాధిగా నింద మోపబడ్డ వ్యక్తి తాను నేరములు జరగకుండా ఎంతో జాగ్రత్తతో మసలు తున్నట్లున్నూ ఈ జరిగిందని చెప్పబడ్డ నేరం జరుగు తున్నట్లే తనకు తెలీదని చెప్పి రుజువు చేసినట్లయితే అతడు శిక్షకు పాత్రుడు కారాదు అని 17 వ సెక్షనులో ఉంది

కోర్టులకు పోయింతర్వాత ఎన్నో చిక్కులు. ఆహారమంటే ఏమిటనేది ఒక ప్రశ్న అయింది. బెల్లం, 'గుర్', ఆహారమవునా కాదా అనే సమస్య 1973 లో సుప్రీంకోర్టులో వచ్చింది చివరకు అది ఆహారమే నన్నారు (1973)2 యస్ సి జె. లో. ఇది 1976 లో సవరణద్వారా ఆహారం అనే పదాన్ని నిర్వచించారు. నీరు, మందులు తప్పించి మనుషులు తినేది తాగేది యేదైనా ఆహారమేనన్నారు ఇంకా సర్వ సాధారణంగా తిండిలో కలిపి తినేదేదైనా ఆహారమే నన్నారు. సువాసన ద్రవ్యాలను కలపి తింటాం గనుక ఆయా సువాసన ద్రవ్యాలు కూడా అందుకయి కొన్నప్పుడు అవీ ఆహారమేనని నిర్వచించారు. ఇంకా చికాకులు ఏవైనా వచ్చేటట్లయితే కేంద్ర ప్రభుత్వం అధికారిక గెజిటులో ప్రమరించిన అధి సూచన ద్వారా ఫలాని పదార్థం ఆహారమేనని చెప్పవచ్చు

కల్తీ ఆహారం అని అన్న తరవాత కూడా ఆ కల్తీవల్ల అది తిన్నవారికి ఆరోగ్యభంగం అవుతుందో లేదో తెలుసు కొని అవు తున్నట్టు ప్రాసిక్యూషను రుజువు చేయందే అభియోగం చెల్లదని ఒక వాదం ఉండేది. సుప్రీంకోర్టువారు ఎ ఐ ఆర్ 1974 యస్. సి 434 లో అలా రుజువు చేయాల్సిన బాధ్యత ప్రాసిక్యూషను వారిపై లేదన్నారు.

ఆహార పరిశీలకాధికారి శాంపిల్ 10 వ సెక్షన్ క్రింద తీసుకొనేటప్పుడు ఒకటి రెండు సాక్షుల సంతకాలు తీసుకోవాలనేది తప్పని సరి అయినదని అలా తీసుకొనకపోతే ప్రాసిక్యూషను వాదం నెగ్గదని ఎ. ఐ ఆర్. 1974 యస్. సి. 789 లో సుప్రీంకోర్టు వ్రాశ్చారు

శాంపిల్‌ను ఎనలిస్టుకు పంపటం ఆలస్యం అయితే అలా ఆలస్యం చేయవద్దని అపరాధి దరఖాస్తుచేసుకోలేదు. అయినా క్రింది కోర్టువారు అతడిని నిరపరాధిగా వదలివేశారు సుప్రీంకోర్టు అది సరియైన పద్ధతి కాదంటూ 1974 1 యస్. సి. జె. 198 లో తీర్పునిచ్చారు

ఒక కంపెనీ చేసిన నేర విషయంలో అప్పటికి ఫరమును ఎవరు అధీనంలో ఉంచుకొని నిర్వహిస్తున్నారో వారే బాధ్యులని తీర్పునిచ్చారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు 1973 (2) ఆంధ్రప్రదేశ్ వీక్లీ రిపోర్టర్ 315లో ఇదివుంది

ఆహార పరిశీలకాధికారికి అమ్మినది అమ్మకం అవుతుందా కాదాఅని సమస్య వచ్చింది. ఆయన అనుభవించడానికి కొన్నదికాదు గదా అని వాదించారు. కాని సుప్రీంకోర్టు అది అమ్మకమేనని తీర్పు నిచ్చారు, (1973 2 యస్. పి. జె 621). అలాగే ఇంకో కేసులో టీ పెట్టి యివ్వడానికి గాను పాలు వుంచారు హోటల్లో. వాటి శాంపిల్‌కోసం, అధికారి పాలను కొన్నాడు. ఇదికూడ అమ్మకమేను—అని పాలు కల్తీ పాలయినట్లతే శిక్ష తప్పదన్నారు. (1974 1 యస్ సి. జె. 198 )

ప్రజలకు, పౌరులకు, మహిళలకు, యువకులకు ఎవరికైనా చట్ట ఆంతర్యం తెలిసికొనటం ప్రధాన కర్తవ్యం. అది ఏ ధర్మం మీద నిలబెట్టబడి ఉందో ఆ ధర్మం అంతరాంతరాలో మెదల నివ్వటం అనేది శిరోధార్యం. ఆహారం ప్రజల శరీర పోషణకు అనువుగా ఉండాల్సినట్టిది. అది వారు జీర్ణించుకొని అన్నరసమై నాడుల్లోని గాలిలో కలిసి, రక్తంలో జేరి, కండలు ఎముకలు మేథస్సు తెలివితేటలు బుద్ధి పెరగాలి. అందుకనే మనకున్న మనో బుద్ధుల్ని కూడ మన తెలివితేటల ద్వారా ఎముకలు కండలు రక్తం చర్మం, ఇంద్రియాలు ద్వారా ప్రసరింపజేసి మనం చేసే కర్మలను సరిదిద్దటం ఎంతో అవసరం. ధర్మయుతమైన బుద్ధి గలవాడు చట్టఆంతర్యాన్ని గ్రహించి అలా నడుచుకొనటం చాల తేలిక. అధర్మ ప్రవృత్తి మాత్రమే మనసులో అనుసంధానం చేస్తే ఈ చట్ట నిబంధనల నుంచి ఎలాబైట పడతాములనే దొక్కటే విచారించటం జరుగుతుంది. పసివారికి వయసు వచ్చిన కొద్దీ దుస్తులు వేసుకొని ఉండటము ఎలా అలవాటవుతోందో అలా ఎల్లప్పుడూ ధర్మమనే కవచం తొడుక్కొని ఉండటాన్ని వ్యక్తి అలవాటు చేసుకోవాలి.

బామ్మ చెప్పిన మాట తిరిగి విశదీకరించాలనిపించింది. అందుకని "ఇలా వ్రాశానమ్మా" అని మా బామ్మకు వినిపించానీ వ్యాసం. అంతావిని "అయితే బాగానే ఉందిగాని బియ్యంలో రాళ్ళు వస్తున్నయ్యన్న కారణం మీద, ఏ అధికారీ వెళ్లి పట్టుకోటానికి వీల్లేదన్నమాటేగా" అంది. "ఏం" అన్నాను.

"వ్యవసాయ మూలంగావచ్చిన ఆహార పదార్థాన్ని యథాతథంగా పట్టుకోరాదన్నావుగా!"

చిన్న గుటక వేయాల్సి వచ్చింది. "బియ్యం యథాతథంగా వ్యవసాయం వల్ల వస్తవటమ్మా! ఫ్యాక్టరీ నుంచి వస్తవిగాని!" అన్నాను. మా బామ్మ బోసినోరు తెరిచింది. చివరకు అంది. "ప్లీడరు సవాళ్లు మీద బ్రతుకుతున్నార్రా మీరంతా!" అని "మరి జొన్నల మాటేం చెప్పుతావు? ఆవాలు మాటేం చెపుతావు?" అన్నది.

"నిజమే" అన్నాను.

"ధర్మం తప్పితే శిక్ష తప్పదు-అని మాత్రమే శాసనం ఉంటే చాలు. అంతేగాని-మాటల్లో-"ధర్మం అంటే ఫలాన" అని చెప్పటం ఆరంభిస్తే-మాటలు నేర్చిన కుక్క 'ఉస్కో' అంటే 'ఇస్కో' అందిట అలా ఉంటుంది" అన్నది.

"అంటే?" అన్నాను.

"తథాపిన తవస్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే" అన్నట్లు జ్ఞానమంతా నేర్చుకొన్నాక ఆ జ్ఞానాన్ని చెప్పిన మాటలన్నీ మరిచి పోయినాక నిలిచేది జ్ఞానం. అదేధర్మం. 'సత్య' మనేదేదో అప్పటికి గాని తెలిసినట్లు కాదు. అన్నాడు అష్టావక్రమహర్షి" అన్నది.

ఈమెకు సంతృప్తి కలిగేలా వ్రాయడమెలా!

*

---

## పెళ్లికేం తొందర?

—శ్రీ బి.యస్. మూర్తి

మధ్యతరగతి కుటుంబంలో పుట్టింది, మన మీనాక్షి
ప్రస్తుతం చదువుతున్నది, ఆపిల్ల పదో తరగతి
చదువుకు తగ్గదే, మన కథానాయిక వయస్సు
పదిహేనో, మహా అయితే పదహారో; అంతే!

గత ఏడాదిగా తల్లిదండ్రుల మనస్సులలో
మెదులుతోంది ఆలోచన — తెలుసా, ఏమిటో?
మన అమ్మాయికి వచ్చింది అనుకోకుండా ఈడు
పెండ్లికి వెదకాలి, సరియైన జోడు.

మన మీనాక్షి మనస్సులో మాత్రం
మెదలడం లేదు, మంగళ సూత్రం.
ఆ పిల్ల పదోక్లాసు చదువుతోపాటు
పెంపొందించుకొంది, చక్కని ప్రపంచ జ్ఞానం.

ప్రస్తావించిందొకనాడు, తల్లి పెళ్ళి విషయం
సౌమ్యంగానే మీనాక్షి చెప్పింది సమాధానం

తెల్లబోయిన తల్లిని చూచి — అమ్మా! చదువులో నేను
చక్కగా వస్తున్నాను గదే! ఇప్పుడే ఎందుకే నాకీ బెడద?

మారుతున్న కాలంతోపాటు, మారాలి మనం కూడా
గత కాలపు సాంప్రదాయాలు, అన్నీ కాలాలకూ తగుతాయా?
తగిన ఈడు రాకుండా పిల్లలపై బాధ్యత వేయడం,
న్యాయమేనా తల్లిదండ్రులకు నేటి తరుణం!

ఆలోచించండి! అమ్మలూ అయ్యలూ
తొందర పడకండి, ఆడపిల్లల పెళ్ళి గురించి,
చదువు చెప్పించండి, సాధ్యమైనంత వరకూ
అవకాశమివ్వండి మీ అమ్మాయి వ్యక్తిత్వానికి

చదువుకున్న ఆడపిల్లలు సంఘానికి జీవనాడులు
అక్షరాస్యతా వ్యాప్తికి వారు ఆటపట్టువులు
ఏ సంఘంలో స్త్రీకి సముచితమైన స్థానం వుంటుందో
అక్కడ జయప్రదం అవుతాయి సర్వకార్యములూ.

సీరియల్ :

# నిరాశలో నిండు గుండె

— సి. ఆనందారామం

## జరిగిన కథ

శ్యామ్ తండ్రి జనార్దన్ వద్ద పెరిగిన సి.ఐ.డి. అధికారి మోహన్ లోటస్ హోటల్ యజమాని సాంబశివం చేస్తూన్న దొంగనోట్ల వ్యాపారం పట్టివ్వడానికి ప్రయత్నిస్తున్నాడు. ప్రసూన చిరంజీవి మోహన్‌కు సహాయం చేస్తున్నారు. ఈ కేసు నుండి ప్రసూనను దూరం చేయమని సుశీలను కోరుతాడు శేఖర్. పరమేశ్వరి సహృదయుల సాయంతో కూలిపేటలో అనాధ సేవ చేస్తూంది.

శ్యామ్ దొంగతనం చేస్తూండగా తీసిన ఫొటోలను తనకిచ్చి అతడిని వదిలివేయమని ప్రాధేయపడి మోహన్‌ను అక్రమ ప్రవర్తనకు గురిచేస్తాడు జనార్దన్. సుశీలను, శేఖర్‌ను ఎవరో హత్య చేస్తారు. లలిత ఆ శోకం భరించలేకస్మృతితప్పి పడిపోతుంది. ప్రసూన సాంబశివం యింటిని అంటి పెట్టుకుని వుండి సేవ చేసేందుకు అంగీకరిస్తుంది లలిత సాంబశివాన్ని విడిచి యిల్లు వదలి పోతుంది.

## 23

సాంబశివం ధోరణి పూర్తిగా మారిపోయింది— బయట నలుగురిలో గంభీరంగా నెట్టుకొస్తున్నాలోలోపల అతనెతగా కృంగిపోతున్నాడో అర్థంచేసుకో గలినది ప్రసూన ఒకర్తే! ప్రసూన కనిపెట్టి కాఫీ ఫలహారాలిస్తే తీసుకుంటాడు విపరీతంగా త్రాగుతాడు. భోజనానికి రమ్మంటే వస్తాడు లేకపోతే అలాగే ఉండిపోతాడు విపరీతంగా త్రాగుతాడు. ప్రసూన మందలిస్తేకొంచెం సేపు త్రాగకుండా ఉంటాడు ప్రసూన కాస్త కనుమరుగు కాగానే మరింత తాగుతాడు

తాగినప్పుడు ఏదోఏదో మాట్లాడుతాడు—

"సుశీ! నిన్ను చూసుకొని మురిసి పోయేవాడిని నీలాంటి కూతురికి తండ్రి కాగలిగిన నా అదృష్టాన్ని తలుచుకుని తలుచుకుని గర్వపడేవాడిని . 'నేనొక పెద్దయింటికి యజమానిని. లలిత లాంటి భార్య, సుశీల లాంటి కూతురు— 'అని మనసారా పదే పదే అనుకునే వాణ్ని— నేను సంపాదించి నీకు సర్వసుఖాలు అమర్చాలని అనుకునే వాణ్ని— నువ్వు వెళ్ళిపోయావు— ఏంచెయ్యగలను? ఎలా తెచ్చుకోగలను నేను నిన్ను?"

ఇవేమాటలు మళ్ళీ మళ్ళీ— అనే వాడు—తనను ఎవరూ చూడనప్పుడు తలగడలో తల దాచుకుని కుమిలికుమిలి ఏడ్చేవాడు— ప్రసూనతో రోజు కొకసారయినా " నన్ను విడిచి వెళ్ళవు కదూ!" అనేవాడు, దీనాతిదీనంగా —దయనీయంగా .

"వెళ్ళను!" అనేది ప్రసూన కన్నీళ్ళతో.

సాంబశివాన్ని చూస్తోంటే తనకు తెలియకుండానే ఎందుకలా కరిగి పోతుందో ప్రసూన అర్థం చేసుకోలేక పోతోంది— సుశీల చచ్చిపోవటం లలిత వెళ్ళిపోవటం ప్రసూనను గురించి అందరూ రకరకాలుగా చెప్పుకోసాగారు — ఎవరు ఏమనుకున్నా సాంబశివాన్ని వదలి రాదలచుకోలేదు ప్రసూన.. తను కూడా వచ్చేసిన మరుక్షణం సాంబశివం ఏమయి పోతాడో ఊహించుకో లేకపోతూంది— వారంరోజుల తర్వాత పరమేశ్వరి దగ్గిరకు వచ్చింది ప్రసూన. అక్కడ లలిత కూడా ఉంది—లలితను చూసి ప్రసూన ఎంత ఆశ్చర్యపోయిందో ప్రసూనను చూసి లలిత కూడా అంతే ఆశ్చర్యపోయింది

పరమేశ్వరి ప్రసూనను లలితకు పరిచయం చేసింది "ఈ అమ్మాయి ప్రసూన నాకు కుడిభుజంలా పనిచేస్తుంది. ఇదివరకు ఇంచు మించు రోజూవచ్చేది ఈ మధ్యనే వారం రోజులుగా రావటంలేదు. నాకు నచ్చిన వ్యక్తి." లలిత ముభావంగా "నాకు తెలుసు—" అంది.

"అలాగా?" ఆశ్చర్యంగా అన్న పరమేశ్వరి లలిత ముఖాన్ని చూసి ఆగి పోయింది.

లలిత ప్రసూనను ఉద్దేశించి "సుశీల కూడా నీతో వచ్చేరా?" అంది

"లేదు— తను సాయంత్రం వేళ.. "

ప్రసూన ఆగిపోయింది

"నీకూ తెలుసా ?"

ప్రసూన తెలుసు నన్నట్టు తల ఊపింది—

"మరి ఎందుకు చెప్పలేదు?"

ఏమని చెప్పను? ఎవరికి చెప్పను? పైగా ఇంత దారుణం జరుగుతుందని నేను అనుకోలేదు. సుశీల శేఖర్‌తో వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్న సంగతి కూడా నాకు తెలియదు.

సుశీలను తలచుకుని ప్రసూన కళ్ళు చెమ్మగిల్లాయి.. లలిత తట్టుకోలేక చేతులతో ముఖం కప్పుకొని కుమిలి పోయింది.

ప్రసూన దగ్గరగా వెళ్లి "అమ్మా!" అని ఓదార్చ బోయింది లలిత చటుక్కున ప్రసూన చేతిని తొలగించింది. "నన్ను క్షమించు నేను నిన్ను అభిమానించ లేను. నాకు దూరంగానే ఉండు—"

ప్రసూన చాలా బాధ పడింది

"నేను చేసిన తప్పు ఏమిటో చెపుతారా?"

ఒక్కొక్కసారి మనం చెయ్యని తప్పులకు కూడా మనం బాధ్యత వహించ వలసి వస్తుంది."

"ఏకలవ్యుడికి ద్రోణాచార్యుడిలాగా మీరు నాకు పరోక్షంగా గురువులాంటి వారు. సుశీలకు మీరంటే ఎంతో ఆరాధన చిన్నప్పటి నుండీ. అమ్మ ఇలా అంది- అమ్మ అలా అంది- అని చెప్పేది- నాకు మీరంటే మొదటినుంచి అలాంటి ఆరాధనా భావమే కలిగింది. ఒకసారి నేను వంటి నిండా నగలు పెట్టుకొని వచ్చాను- సుశీల అమ్మకు ఇలా నగలు పెట్టుకోవటం ఇష్టం లేదు అంది. తర్వాత ఎప్పుడూ నేను వెర్రిగా నగలు పెట్టుకోలేదు"అమ్మ ఎప్పుడూ చదువు కొంటూ ఉంటుంది-" అంది సుశీల. ఆ రోజునుండీ నేను మంచి మంచి పుస్తకాలు చదవటం మొదలు పెట్టాను- అలా అలా నాకు తెలియ కుండానే మీఅడుగు జాడలను అనుసరించటం నేర్చుకున్నాను.

లలిత నిట్టూర్చింది

సుశీలకు తనంటే ఎంతో ఆరాధన-నిజమే కానీ తండ్రినుండి కొన్నికొన్ని బలహీతనలు కూడా వచ్చాయి- తండ్రి గారాబం వాటిని మరింత పెంచింది తను ఏమీ చెయ్యలేని నిస్సహాయురాలై పోయింది- ఒక మంగళ సూత్రం.... ఈ సామాజికాచారం.... స్త్రీని ఎన్ని విధాలుగా బందీని చెయ్యగలదు? "ప్రసూనా! నీలో ఏదో లోపమున్నదని కాదు! కాని" ఆగిపోయింది లలిత..

"ఎవరి తప్పులకు నన్ను బాధ్యత వహించ మంటున్నారు?"

"నీ తలిదండ్రుల దోషాలకు- ఈ శాపం నీకు తప్పదు!" రాధమ్మా, హరి, ప్రసూన కళ్ళముందు కదిలారు అక్కడ ఉండ లేక వెళ్ళి పోయింది

పరమేశ్వరి చాలా నొచ్చు కుంది-

"లలితా! నువ్వుకూడా తలిదండ్రులు చదువు సంస్కారము లేని వాళ్ళని అమాయికురాలినని నిరసిస్తున్నావా?"

"నీకు అర్థం కాదు పరమేశ్వరీ! అర్థమయ్యేలా నేను వివ రించలేను ఈ విషయం వదిలెయ్యి."

లలిత ముఖంలో ఆవేదన చూసి పరమేశ్వరి ఇంకేమీ మాట్లాడలేక పోయింది

ప్రసూనను కలుసుకోవటానికీ ఏదో ఒక వంకతో కూలి పేటకు వస్తున్నాడు మోహన్ ప్రసూనను చూడగానే అతని ముఖం వికసించింది. మోహన్ కనపడగానే ప్రసూన కూడా ఒక్కక్షణం తన చికాకులన్నీ మరిచిపోయింది

"మీరింక ఇక్కడికి రారేమో అనుకున్నాను''

ప్రసూనతో అన్నాడు మోహన్

"ఏం?''

"మీరు సాంబశివంగారి ఇంట్లో ఉన్నారని విన్నాను "

ఈ విషయంలో సూటిపోటి మాటలు వినివిని ప్రసూన మనసు బండబారి పోయింది ఎంత చిన్నదయినా సరే! సమాజాన్ని ఎదిరించి ఒక పనిచెయ్యటం మాటలు కాదు . అందులో ఇలాటి వ్యవహారాలను సమాజం అసలు వదిలిపెట్టదు.

"మీరు విన్నది నిజమే"

"అక్కడెందుకున్నారు?"

"ఆయన ఉండమన్నారు"

ఆ సమాధానాలు భరించలేకపోయాడు మోహన్.

" ప్రసూనా! నువ్వు అతని దగ్గిర ఉండవలసిన అవసరం లేదు. వచ్చెయ్యి"

"అవసరం ఉందో లేదో మీరు ఎలా చెప్పగలరు?

"నాకు సహాయం చెయ్యటానికి అక్కడ ఉండక్కర్లేదు"

"అందుకు మాత్రమే నేను అక్కడ ఉండటం లేదు "

"మరి నిన్ను నిర్బంధించే శక్తి ఏమిటో తెలుసుకోవచ్చా?"

"నిర్బంధమా? అలాంటిదేమీ లేదే, నేను నా ఇష్టప్రకారమే అక్కడ ఉంటున్నాను"

" ఐ సీ" వెటకారంగా నవ్వాడు మోహన్.

"హమ్మయ్య! అర్థమయిందా?" నవ్వింది ప్రసూన.

"లలిత చాలామంచిది. ఆవిడముఖంచూసినా జాలికలగలేదా?"

ప్రసూనకు మండిపోయింది.

"మంచి అంటే ఏమిటి మీ ఉద్దేశంలో, పతి సేవా పరాయణురాలు అనా? అయితే లలితగారిలో అలాంటి మంచితనం లేదని నేను రూఢిగా చెప్పగలను అంచేత నా వల్ల ఆవిడకు జరిగిన అపకారమేమీ లేదు మీరు నిష్కారణంగా జాలిపడకండి.

ఒక్కక్షణం ఆగి ప్రసూన వ్యంగ్యంగా మళ్ళీ అడిగింది

"రేఖతో 'వ్యవహారం' ఎంతవరకు వచ్చింది?"

'వ్యవహారం' అనే మాటకు ఎన్నిఅర్థాలైనా ఉన్నాయి. ఆ అర్థాలన్నీ ధ్వనించేలాగనే అంది ప్రసూన.

"నా పనిమీద నేను ఎందరినైనా కలుసుకోవలసి వస్తుంది".

"అవునుపాపం! రేఖ చెప్పింది మొన్నరాత్రి అంతా హోటల్ గదిలోనే ఉండిపోవలసి వచ్చిందట!"

దొంగనోట్లు ఎక్కడ ప్రింట్ అవుతున్నాయో తెలుసు కోవాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాడు మోహన్ ఏరకంగానైనా దానికి ఆధారాలు సంపాదించాలి! రేఖ ఏమైనా ఉపయోగపడగలదేమో చూడాలని అనుకున్నాడు.

"మీకు ఉపయోగి పడటంకన్న నాకు కావలసిన దేముందీ?

"అంత అదృష్టమా? రండి!" అంది రేఖ

రేఖ ఎంత తెలివైనదో మోహన్‌కు బాగా అర్థమయింది. తలచుకుంటే రేఖ తనకు సహాయం చెయ్యగలదు. "విశ్వాసం" లాంటి పిచ్చి సెంటిమెంట్లు పెట్టుకునే వ్యక్తికాదు రేఖ .. కానీ మూల్యం కోరకుండా తనకు సహాయం చెయ్యదు—చూడాలి!

మోహన్‌ను ఎంతో ఆదరంగా ఆహ్వానించింది రేఖ

"ఏం కావాలో చెప్పండి!" అంది.

"మీ హోటల్‌లో. .

"అన్నీ దొరుకుతాయి" . .

"నాకు కావలసినవి కొన్ని విషయాలు!"

"ఇది హోటల్ సార్! ఇక్కడ ప్రతీదీ కొనుక్కోవలసిందే!"

కొనాలనే వచ్చాను. బేరం కుదరాలిగదా!"

"బేరం సంగతి చూసుకుందాం లెండి! ముందు మీరేం తీసుకుంటారో చెప్పండి!"

"కాఫీ చాలు!"

"అబ్బ' అన్నివిషయాల్లోను సింపుల్! పోనీయండి మీఇష్టమే నా ఇష్టం!"

"కాఫీ తాగుతూ "జీవితంలో ఏదైనా భరించగలం! కానీ, ఒంటరి తనం మాత్రం భరించలేం!" అంది.

రేఖ ఏ విషయానికి దారి తీస్తోందో మోహన్ ఊహించ గలిగాడు. ...

'మీకు ఒంటరి తనమేమిటి' అన్నాడు. రేఖలోపల బాధపడింది. ఇతడు మంచివాడే కావచ్చు! తన నెందుకు అవమానిస్తాడు తన మనసులో రగిలే జ్వాలలు ఇతనికి అర్థంకావా?

"ఒంటరిని కాక...ప్రసూన లాగా తోడు వెతుక్కుంటూ ఎక్కడంటే అక్కడ ఉండగలనా?

రేఖ గురిచూసి వదిలిన బాణంలాగా నాటుకుంది. తనను తాను నిగ్రహించుకోవటానికి మోహన్ తనకున్న శక్తినంతా వినియోగించవలసి వచ్చింది.

"నాకు సమాజమంటే చాలా భయమండీ! దాన్ని ఎదిరించలేను నలుగురిలో ఉన్నప్పుడు 'అవున'నిపించుకోకుండా ఇష్టం వచ్చినట్లు ఉంటామంటే ఏం బాగుటుంది చెప్పండి!'

మోహన్‌కు అవకాశం వచ్చింది.

"దానికేముంది లెండి! అబద్ధాలాడటం తెలిసి నటన చక్కగా చేతనయితే ఎంతమందిలో నయినా "అవును" అనిపించుకోవచ్చు.

లోలోపల పళ్ళునూరుకొని పక పక నవ్వింది రేఖ.

"మీకు కావలసిన విషయాలేమిటో చెప్పండి.

(సశేషం)

---

## మహాభారతం

( 37 వ పేజీ తరువాయి )

"కౌంతేయా! ఏ నేను సుగంధ ద్రవ్యములను కుంతీదేవి కొరకు దప్ప నాకొరకు గూడ నూరుకొనకుంటినో, అట్టి నేను దాసినై యితర స్త్రీలకొరకు చందనమును నూరు చున్నాను. నా చేతులు చూడుము, పూర్వమువలెనున్నవా? కాయలు కాసినవి." అని భీమసేనునికి రెండు చేతులు చూపి యిట్లనెను.

"నాథా! పూర్వమెప్పుడు గూడ కుంతీదేవికిగాని, మీకు గాని భయపడకుంటిని. అట్టి నేనిప్పుడు విరాటుని యెదుట భయపడుచు దాసివలె నిలువ కోవలసి వచ్చినది. విరాటరాజు నేను నూరిన చందనము బాగుగ నున్నదనునో లేదో, అని భయముతో నిలిచి యుందును. నేను నూరిన చందనమే అతనికి నచ్చియుండును గనుక నన్నే సర్వదా చందనము నూరు మనుచుండును."

"జనమేజయా! ద్రౌపది తన దుఃఖములన్నియు ఈ విధముగా భీమసేనునకు చెప్పి అతని ముఖమును చూచుచు దుఃఖించుచుండెను. కన్నీరు రాల్చుచు డగ్గుత్తుకతో మాట్లాడుచు భీమసేనుని హృదయము కంపింప జేసెను. "నేను పూర్వము దేవతల యెడల చిన్న అపరాధమును చేయలేదు. పెద్దదే చేసినాను. ఎందుకనగా, చావవలసియుండగా, యింకను జీవించియున్నాను." అని చెప్పెను. ఆ మాటలు విని భీమసేనుడు, జనమేజయ మహారాజా! కాయలు కాసిన ద్రౌపది రెండు చేతులను తన ముఖముపై నుంచుకొని యేడ్చెను. ఆమె చేతులను పట్టుకొని కన్నీరు రాల్చుచు భీముడు ద్రౌపదితో నిట్లు చెప్పదొడగెను.

(సశేషం)



# ఉత్తమ మహిళా మండలి

... 1974-75 సంవత్సరానికి, కృష్ణాజిల్లా, గన్నవరం సమితిలో వున్న పెద అవుటపల్లి మహిళామండలి రాష్ట్రంలోకల్లా ఉత్తమ మహిళా మండలిగా ఎన్నికయింది

1960లో గాంధీ జయంతినాడు 30 మంది సభ్యురాండ్రతో ఈ పెద అవుటపల్లి మహిళామండలి ఆవిర్భవించింది. ప్రథమంలో గన్నవరం పంచాయితీ సమితి వంద రూపాయలు ఆర్థిక సహాయాన్ని కుట్టు, అల్లికలకు కావలసిన పరికరాలను సమకూర్చుకునేందుకు అందజేసింది. తర్వాత సగము ఖర్చు భరించే పద్ధతిమీద రెండు కుట్టుమిషన్లతోపాటు, ఒక కుట్టుపని నేర్పే ఉపాధ్యాయినిని సమితివారు ఏర్పాటు చేశారు. ఈ చేయూత, మండలి సభ్యులకు, గ్రామ మహిళలకు నూతనోత్సాహాన్ని కలుగజేసింది. చివరకు 40 మంది బట్టల తయారీ పనిలో సుశిక్షితులై, వారిలో సుమారు 15 మంది సొంతంగా కుట్టుమిషనులు కొని, జీవనోపాధి పొందుతున్నారు.

1965లో ఈ పెద అవుటపల్లి మహిళామండలి రిజిష్టరు అయింది.1968లో ఈ మహిళామండలి స్వంత భవనాన్ని ఏర్పాటు చేసుకోగలిగింది. ఏడువేల రూపాయల ఖర్చుతో నిర్మించిన ఈ భవనంలో కేర్ (CARE) సంస్థవారి అనువర్తిత ఆహార పథకం క్రింద మధ్యాహ్న భోజన సదుపాయం కల్పించారు. సుమారు 30 మంది గర్భిణీ స్త్రీలకు, 70 మంది బాలబాలికలకు ఈ పథకం క్రింద పోషణ జరుగుతుంది మహిళా మండలి ఆర్థిక పరిపుష్టి కోసం, మహిళామండలి సభ్యురాండ్రు ఒక కోళ్ళఫారం, ఒక పోరుమిల్లు నిర్వహిస్తున్నారు. నవారు నేత, నవరాల తయారీ, తుంగచాపలు, విసనకర్రలు అల్లిక, తేనెటీగల పెంపకం వంటి కుటీర పరిశ్రమలలో ఈ మండలి సభ్యులందరు సుశిక్షితులయ్యారు. నవారు, విసనకర్రలు మంచి నాణ్యంగా వుండుటచేత, పరిసర గ్రామాలలో, వీటికి మంచి గిరాకీవుంది ప్రభుత్వంవారి కుటీర పరిశ్రమాభివృద్ధి సంస్థ, స్థానిక విజయకృష్ణ సూపర్ బజార్ వంటి సంస్థలు ముందుకువచ్చి, ఈ మహిళామండలి తయారుచేసే వస్తువులకు మార్కెటింగ్ సౌకర్యం కల్పించవలసిన అవసరం ఎంతైనా వున్నది.

కుటుంబసంక్షేమ పథకాలను, వాటి లక్ష్యాలను గ్రామంలో యింటింటికి ప్రచారంచేసి, ట్యూబెక్టమీ, వ్యేసక్టమీ ఆపరేషనులను స్థానిక ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో విజయవంతంగా ఈ మహిళామండలి నిర్వహించింది. కుటుంబ సంక్షేమ వారోత్సవాలలో పాల్గొని ఈ మహిళామండలి స్వచ్ఛంద సేవలను అందించింది. ఈ మహిళామండలి బహుముఖ సేవలను ప్రశంసిస్తూ, కృష్ణా జిల్లా కలెక్టర్ ఒక ట్రాన్సిస్టర్ రేడియోను ఈ మహిళా మండలికి బహూకరించారు

> 1970-71లో రాష్ట్రస్థాయిలో ఉత్తమ మహిళా మండలిగా ఎన్నికైన సందర్భంలో "యునిసెఫ్ దక్షిణ భారతదేశం ప్రతినిధి గుహాప్రసాద్‌గారు ఈ పెద అవుటపల్లి మహిళా మండలిని సందర్శించి, వారు చేస్తున్న కృషిని ప్రశంసించి, వెయ్యి రూపాయలు మంజూరు చేశారు
>
> 1974-75వ సంవత్సరానికి, ఉత్తమ మహిళా మండలిగా ఎన్నికైన సందర్భంగా లభించిన వెయ్యి రూపాయల బహుమతిని, మహిళామండలి సభ్యురాండ్రకు, కుటీరపరిశ్రమల అభివృద్ధికోసం స్వల్పవడ్డీకి అప్పుగా యిచ్చారు

అయిదువేల జనాభాగల ఈ పెద అవుటపల్లి గ్రామంలో, ఈ మహిళామండలి "వయోజన విద్యాకేంద్రాన్ని" నిర్వహిస్తున్నది. గ్రామంలో బాలికోన్నత పాఠశాల స్థాపనకు విశేష కృషి జరిపి, ఈ మహిళామండలి విజయం సాధించింది. వయోజన స్త్రీవిద్యకు ప్రోత్సాహాన్ని యిచ్చి ప్రగతిపథంలో ముందంజ వేసున్నది ఈ మహిళామండలి

పెద అవుటపల్లి వాస్తవ్యురాలు శ్రీమతి వేగి సుబ్బమ్మగారు ఈ మహిళామండలికి ఒక ఎకరం ఫలవంతమైన భూమిని విరాళంగా యిచ్చారు. ఈ ఎకరం భూమిలో, వివిధ రకాలైన కూరగాయలను మహిళామండలివారు పండిస్తున్నారు. గ్రామంలో వంద కొబ్బరి మొక్కలను, పది పండ్ల జాతి మొక్కలను నాటి, వనమహోత్సవ కార్యక్రమాన్ని ఈ మండలి ఉధృతం చేసింది.

మురికివాడల నిర్మూలన, మాతా-శిశు సంక్షేమం, పౌష్టికాహార పథకంవంటి కార్యక్రమాలనెన్నింటినో, ఈ మహిళామండలి నిర్వహించింది. గాంధీజీ జయంత్యుత్సవాల సందర్భంగా గ్రామంలోని హరిజన స్త్రీలకు జాకెట్టు బట్టలను, స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా బాల్వాడీ పిల్లలకు యూనిఫారం బట్టలను, ప్రతి సంవత్సరం ఈ మహిళామండలి అందజేస్తున్నది.

గ్రామ మహిళాలోకంలో నూతనోత్తేజాన్ని రేకెత్తించి, గ్రామాభ్యుదయానికి అంకితమై, ఆదర్శ మహిళామండలిగా వాసికెక్కింది ఈ "పెదఅవుటపల్లి మహిళామండలి". 1969లో పెద అవుటపల్లి రైల్వే స్టేషనువద్ద రైలుబండి ప్రమాదానికి గురియైనప్పుడు ప్రయాణీకులకు స్వచ్ఛందంగా ఉచిత భోజన సౌకర్యాలను యీ మహిళామండలి కలగజేసింది.

—శ్రీ మల్లిడి సత్తిరెడ్డి

విశాఖ చిత్రకళా పరిషత్ వారు యిటీవల స్థానిక 'బా–బాపు భవన్'లో చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఈ సంస్థ ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడమీకి అనుబంధ సంస్థ. కేంద్ర లలితకళా అకాడమీ, న్యూ ఢిల్లీ వారు ఈ సంస్థను గుర్తించారు.

సుమారు దశాబ్దం క్రిందట చిత్రకళా రంగంలో విశేష అనుభవాన్నీ, విఖ్యాతినీ గడించుకున్న శ్రీ వి. ఆర్. చిత్ర, శ్రీ అంట్యాకుల పైడిరాజు కృషిఫలితంగా నెలకొల్పబడిన సంస్థ యిది. ఈ సంస్థకు అంట్యాకుల పైడిరాజు గారు అధ్యక్షులు. ప్రతి సంవత్సరం చిత్రకళా ప్రదర్శనను ఏర్పరిచి చిత్రకారులను యథాశక్తి సత్కరించి ప్రోత్సహించడం ఈ సంస్థ ఆశయాలలో ప్రధానమైనది.

చిత్రకళా పరిషత్‌వారు నిర్వహించిన చిత్రకళా ప్రదర్శనలలో ఈ సంవత్సరం ప్రదర్శన పదకొండవది. ఈ సంవత్సరం ప్రదర్శనలో చోటు చేసుకున్న చిత్రాలసంఖ్య సరిగా నూరు. ఇందులో శ్రీ హరిభోలేఖర్ శ్రీమతి లతాచవన్ వంటి చిత్రకారుల చిత్రాలుకూడా వున్నాయి.



"ఆలయానికి" చిత్రకారుడు : శ్రీ ఐ. జె. సన్యాసిరావు

కళారంగం:

## విశాఖ పట్టణంలో
# చిత్రకళా ప్రదర్శన

—"ప్రభాకర దేవ్"



చిత్రకారుడు : శ్రీ జి. ఎస్. ప్రకాశరావు

ముప్పయి ఆరుగురు చిత్రకారులకు నగదు బహుమతులను చిత్రకళాపరిషత్ వారు ప్రకటించారు. ఈ చిత్రకళా ప్రదర్శన వలన చిత్రకారులకు తమ ప్రతిభను ప్రదర్శించే అవకాశమే గాకుండా, వారి కళా ప్రతిభకు తగిన ప్రోత్సాహము, సత్కారము లభించాయి.

ప్రకృతిలోని రమణీయతకు, ప్రజా జీవనంలో వైవిధ్యానికి, భావుకతకు కళా దర్పణం పట్టాయి ఈ ప్రదర్శనలోని చిత్రాలు. రంగుల మేళవింపులో, రేఖా విన్యాసంలో చిత్రకారులు తమ ప్రతిభను ప్రదర్శించారు. ఈ ప్రదర్శనలోని విశేషం

ఏమిటంటే చిత్రకారుడు సౌందర్యానికి ఏంతగా స్పందించుతాడో, సమకాలీన సమస్యలకు కూడా అంతగా స్పందించి చిత్ర రచన గావించగలడనీ, చిత్రకారులలో సామాజిక స్పృహ ఎంత మాత్రం కొరవడ లేదనీ ఈ చిత్రకళా ప్రదర్శన నిరూపించింది. నిరుద్యోగం, దప్పిక, కల్లోలితకదలి, జీవన భారం, స్ట్రీట్ డాన్సర్, వంటి చిత్రాలు యిందుకు ఉదాహరణలుగా నిలుస్తాయి.

ప్రతి జాతికీ తనదంటూ ఒక సంప్రదాయం ప్రత్యేకంగా వుంటుంది. సంప్రదాయంలోని ఔచిత్యాన్ని, విశిష్టతను గుర్తించిన కళాకారులు సంప్రదాయాన్ని కాపాడుకు రావడంలో తమబాధ్యతను విస్మరించ లేదు. "ఆలయానికి " "హంసదూత్యం " అనే చిత్రాలు తెలుగువారి సంప్రదాయ చిత్రకళా రీతుల్ని పుష్కలంగా సంతరించుకున్నాయి. ఈ రెండు చిత్రాల చిత్రకారులు శ్రీఐ. జె. సన్యాసిరావు, శ్రీ ఎమ్. అప్పారావు ఉత్తమ శ్రేణి నగదు అవార్డులను అందుకొన్నారు. శ్రీ.ఐ. జె. సన్యాసిరావు గారి 'ఆలయానికి' చిత్రాన్ని పరిషత్ కొనుగోలు చేసింది.

డాక్టర్ సంధ్యారాణిగారి 'కూటికోసం' చిత్రం సందేశాత్మకమైనది. చూపరుల హృదయాలు ద్రవించేలాగా చిత్రీకరించారు.

శ్రీ రాజేశ్వర రావు 'కారవాన్' చిత్రం రంగుల మేళవింపు దృష్ట్యా ప్రశస్తమైనది. ప్రాచీన ఆధునిక కళారీతుల సమన్వయ రూపం ఈ చిత్రం. ఈ చిత్రకారుడు శ్రీ అంట్యాకుల పైడిరాజు గారి అబ్బాయి. చిత్రరచనలో తండ్రికి తగ్గ తనయుడనిపించుకున్నాడు.

రాధాకృష్ణ, సంధ్య. కళారాధన, పారాణి, వికసిత కుసుమాలు వంటి చిత్రాలు ప్రదర్శనకు నిండుతనాన్ని యిచ్చాయి.

చక్కని వైవిధ్యంగల చిత్రాలను ఎన్నుకొని ప్రదర్శనను ఏర్పరచడంలో చిత్రకళా పరిషత్ వారి కృషి సువ్యక్తం అవుతుంది.

ఆహ్లాదకరమైన చల్లని వాతావరణంలో ప్రారంభించబడిన ఈ ప్రదర్శనను కొన్ని వేలమంది తిలకించారు. సంస్థ కార్యనిర్వాహక సభ్యులు శ్రీమతి పి. శారదమ్మగారు చిత్రాల గురించి వివరించారు. ఏటేటా ప్రభుత్వం అండదండలతో చిత్రకళా ప్రదర్శనను ఏర్పరచి చిత్రకారులను ప్రోత్సహించడానికి సంస్థ కృషి చేస్తున్నది.

---

# గిరిజనుల పంచాంగం

ఖమ్మం జిల్లా నూగూరు తాలుకాలోని కొండల మీద నివసించే గిరిజనులు ఏకార్తెలలో వర్షం పడేదీ తెలుసుకొనే పద్ధతి చాలా వింతగాను, ఆశ్చర్యంగాను ఉంటుంది.

గిరిజన గ్రామంలో పెద్దలు, గిరిజనుల పూజారి ఒక ప్రదేశంలో సమావేశమై ఒక పాత్ర నిండ నీళ్లు, కొన్ని విప్పపూలు తీసుకుంటారు. మొదట కార్తెపేరు చెప్పి నీళ్ళపాత్రలో ఒక విప్పపూవు వేస్తారు. విప్పపూవు మునిగితే వర్షాలు పడవని నీటిలో మునగక తేలితే వర్షాలు పడతాయనీ నమ్ముతారు. ఏ కార్తెపేరు మీద పూవు నీటిలో తేలినదీ తెలుసుకొన్న తరువాత ఆ కార్తెలో ఏపాదములో వర్షము పడేదీ తెలుసుకొనేందుకు కార్తెపేరుచెప్పి మొదటి పాదమనిచెప్పి ఒక విప్పపూవును నీటిపాత్రలో వేస్తారు. ఆవిధంగా నాలుగు పాదముల పేర్లమీద నాలుగుపూలు నీటిపాత్రలో వేస్తారు. ఏ పాదముపేరుమీద విప్పపూవు తేలితే ఆ పాదములో వర్షం పడుతుందని వాళ్ళ విశ్వాసము కొండలమీద నివసించే గిరిజనులు ఏకార్తెలో ఏ పాదములో వర్షం పడేదీచెప్పేస్తారు. వాళ్లు చెప్పేది చాలా వరకు జరుగు తున్నందున ప్రజలకు కూడా వారి మాటల మీద గురివుంది.

శ్రీ బి. బాలయ్య

కొండల మీద నివసించే గిరిజనులు వ్యవసాయ కార్యక్రమాలును ప్రారంభించేందుకు ఒక సాంప్రదాయం పాటిస్తారు. వాళ్ళ గ్రామ పూజారి ఏరోజున నాగలికట్టి, విత్తనం చల్లుతాడో ఆరోజు నుంచీ వాళ్లు వ్యవసాయం ప్రారంభంచేస్తారు. పూజారి నాగలి కట్టనంత వరకు వ్యవసాయపు పనిని ప్రారంభించరు వాళ్ళకు పంచాంగంతో పనిలేదు.

సీరియల్ :



# స్వర్ణయోగి

పులిచెర్ల సాంబశివరావు

## —నవమ యోగము—

ఆ రోజు ఎంత దూరం పోయినా ఒక్క మూలిక కూడా లభింప లేదు కొంత దూరం అలా నడచీ నడచి ఒక కొండ దరికి చేరాడు. ఆ కొండ అంచున ఒక గుహ ఉంది.

తనకు తెలియకుండానే వేమారెడ్డి ఆ గుహ దగ్గరకు పోయాడు. గుహలోకి చూశాడు.

వేమారెడ్డి కన్నులు మిరుమిట్లు గొలిపాయి.

గుహలో వింత కాంతులు ప్రసరిస్తున్నాయి. దాంట్లో ఒక దివ్య మూర్తి కూర్చున్నాడు. వేమారెడ్డి వైపే చూస్తున్నాడు. ఆ మహా పురుషుని దేహకాంతి చేత గుహాంతర్భాగం పట్టపగల్లా వెలిగి పోతూంది. దయాపూరితములైన ఆ దివ్య పురుషుని నేత్రాలు వేమారెడ్డిని వివశుణ్ణి గావించాయి ఆ మహాద్భుత పురుషుణ్ణి చూచి వేమారెడ్డి పరవశుడై సాష్టాంగదండ ప్రణామా లాచరించాడు.

"బిడ్డా ! వేమారెడ్డి !"

ఆ దివ్య పురుషుడు వేమారెడ్డిని పిలిచాడు ఆ దివ్య కంఠ ధ్వని విని వేమారెడ్డికి రోమాంచమయింది అతడు చేతులు జోడించుకొని నిలుచున్నాడు.

"అన్నా ! వేమాన్నా !"

ఈ పిలుపు విని వేమారెడ్డి నిర్విణ్ణుడయ్యాడు.

"నాయనా ! నీవిక వేమనవు మాత్రమే ! వేమారెడ్డి లేడు ? నీవు విశ్వ మానవుడవు. ఏ జాతికినీ, ఏ సంఘానికీ చెందినవాడవు కావు నీవు !"

"స్వామీ !" సంభ్రమంతో వేముడన్నాడు.

"వేమన్నా నీ కోసమే ఎదురు చూస్తున్నాను !"

"స్వామీ !" మీ రెవరు? నా కోసం ఎందుకు చూస్తున్నారు? మీకూ నాకూ సంబంధమేంటి ?"

"వేమన్నా ! నీవు వేమన్నవు ! నేను లంబికా శివయోగిని ! నా ఆత్మ నీ ఆత్మ కోసం ఎదురు చూస్తుంది. నేను యోగిని. నీవు స్వర్ణయోగివి అదే మన ఇద్దరకూ ఉన్న సంబంధం !"

వేముడు చకితుడయ్యాడు.

"అవును ! నీవు స్వర్ణయోగివి ! నీకు స్వర్ణం సిద్ధింప బోతోంది. అది సామాన్యమైన స్వర్ణం కాదు సుమా !"

"సామీ ! నేనిప్పుడా ప్రయత్నాల్లోనే ఉన్నాను. మీరు యోగులు కాబట్టి గుర్తు పట్టారు. మీకు నా చరిత్రంతా తెలిసినట్లుంది. నాకా స్వర్ణయోగం సిద్ధింప చేయండి. నా కోసం నా రాజ్యం ఎదురు చూస్తుంది కరుణ చూపించండి !"

"వేమన్నా! నీకు స్వర్ణయోగం సిద్ధింపచేయటానికే నేనిక్కడ ఉన్నాను నీకు కొండవీటి కంటె గొప్ప సామ్రాజ్యమిస్తాను."

"స్వామీ . !"

"వేమన్నా! ఈ ప్రపంచంలో అన్నిటికంటె విలువైన దాన్ని నీ కిస్తాను. నువ్వే చెప్పు! అన్నింటికంటె విలువైన దేమిటి?"

"బంగారం స్వామీ ! బంగారం !"

"బంగారమా ! బాగా ఆలోచించి చెప్పు !"

వమన్న కొద్దిసేపు ఆలోచించాడు.

పరంజ్యోతి వలె ఉన్న స్వామి వదన కమలాన్ని చూచి వేమన సిగ్గు పడ్డాడు.

"ఈ దివ్యపురుషుని ముందా.. తాను విలువైంది బంగారమే అని చెబడం ! బంగారం కంటె విలువైంది ఏమిటి ? ప్రాణం ఉంటే

కదా బంగారంతో పని! కాబట్టి ప్రాణం ముఖ్యమైంది. ఈ ప్రాణం ఉన్నంత వరకే నరుడు బంగారం కోరుతాడు ఈ ప్రాణం ఎక్కడ నుండి వచ్చి ది ' ఏమో! ఈ నరజన్మ ఎంత విచిత్రమైంది? అన్నిటి కంటె విలువైంది ఈ జన్మమే గదా!" అని ఆలోచిస్తూన్నాడు. ఒక నిశ్చయానికి వచ్చాడు.

"మహాపురుషా ' నరునకు విలువైంది వాని జన్మమే స్వామీ!"

"లెస్స-బలికావు నాయనా! అట్టి విలువ గలిగిన మానవ జన్మను బొందిన నీవు, నీ కంటె నీచమైన బంగారం కోసం సర్వ శక్తులూ ధారపోస్తున్నావా? బంగారం విలువైందని భావిస్తున్నావా?"

"స్వామీ! మీరు చెప్పి ది సత్యమే ' కాని బంగారం లేక పోతే నేను రాజ్యం సంపాదించటం ఎలా? దుష్టుల్ని శిక్షించటం ఎలా?"

"నాయనా! నీవు రాజ్యాన్ని సంపాదిస్తావా? నీవు! నీవంటే యెవరు?"

"నేనా ' నేను నేనే స్వామీ! వేమన్నను!"

"నీవు వేమన్న వెప్పుడయ్యావో అప్పుడే నీవు నీవు కాదు నాయనా!"

వేమారెడ్డికి వేమన్నకు భేదమేమి స్వామి?

భేదం పేరులోనే గాదు వేమన్నా! ఆత్మలో కూడా ఉంది. నీవు కారణ జన్ముడవు. మహాజ్ఞానివి!"

"మహాత్మా! మహాజ్ఞానినైతే వేశ్య వలలో చిక్కి పతితుడ నవుతానా?"

మానవునకు కేవల జ్ఞానం చాలదు మేము జ్ఞానం పొంది అడవుల్లో తిరుగుతున్నాం. మా వలన మానవాళికేం లాభం? ఈనాడు భ్రష్టమైపోతున్న సంఘానికి నీ వంటి జ్ఞాని కావాలి. తప్పొప్పులు నీకు తెలిసినంతగా మాకు తెలియవు. అజ్ఞానమంటే ఏమిటో నీకు తెలుసు. ప్రజలు మూర్ఖులుగా ఎలా అవుతారో అనుభవ పూర్వకంగా నీవు తెలిసికొన్నావు. ఇంత అనుభవం ఎవరికుంది? ఈ సంఘానికి కావలసిన దివ్యౌషధం నీకు తెలుసు. సర్వ ప్రపంచం నీ కోసం ఎదురు చూస్తుంది!"

వేమన్న చకితుడై స్వామిని చూస్తున్నాడు.

"వేమన్నా! నీవు పరబ్రహ్మాని దర్శించ గలవు!"

"పరబ్రహ్మమంటే ఏమిటి స్వామీ?"

"అఖిలాకారు డనంతుడు
సకలాత్మల యందు సర్వ సాక్షియు తానై
నిఖిలముల నిర్వికారుడు
నికరము బ్రహ్మమ్మనంగ నిజముర వేమా"

అట్టి బ్రహ్మం అనుభవైక వేద్యమే గాని యిట్టి దని చెప్ప వీలులేదు. అది ప్రకృతిలో పరమాణువులో సైతము పత్యక్షమవుతుంది.

"స్వామీ? ఆ బ్రహ్మం మనకెందుకు? బంగారం వస్తుందా దాని వలన?"

వేమన్నా! మానవుని కీ లోకంలో బంగారం వలన కలిగే ప్రయోజనం ఏమిటి?"

"ఆనందం స్వామీ!"

"ఈ బ్రహ్మ వలన ఆనందం కలుగుతుంది. బ్రహ్మా నందం సిద్ధిస్తుంది. నా మాట నమ్ము, వాదం వదులు!" అని లంబికా శివయోగి వేమన్న చేతిని స్పృశించాడు. వేమన్న ఒడలు జలదరించింది శరీరమంతా విద్యుత్తు ప్రాకినట్లయింది.

వేమన్న లంబికా శివయోగి పాదాల మీద వ్రాలి ఇలా ప్రార్థించాడు.

"స్వామీ! నా కన్నులు తెరిపించారు. మీ దర్శన భాగ్యం వలన నాలోని అజ్ఞానాంధకారం పటాపంచలయిపోయింది మీ బోధనామృతం గ్రోలటం వలన నాజన్మ చరితార్థమైంది. ఈ దీనుణ్ణి మీ శిష్యపరమాణువుగా ఉండటానికి అనుజ్ఞ యివ్వండి! పావనమైన మీ పాద పూజచే నా కల్మష పూరితమైన జన్మను కడిగి వేసు కుంటాను!"

"వేమన్నా! మేమందుక ంగీకరింపం! నీవు జన్మచేతనే జ్ఞానివి కాలం కలిసిరాక నీ ప్రతిభ మరుగున బడింది. ఇప్పుడు తరుణ వచ్చి ది. చూడు! ఈ లోకంలోని అన్యాయాలుచూడు! సమయం వచ్చింది నీ రాకకోసం మీ రాజ్యమొక్కటే కాదు, ప్రపంచమే ఎదురు చూస్తోంది!"

స్వామీ! నేనా నీతులు బోధించటం! పరమ పాపినై ' వేశ్యాలోలుడనైన నేనా.. ! ఇదేం వింత?"

"కామివవటం వలన నీ అనుభవం పండింది. మావంటి విరాగులు అనుభవశూన్యులవటంవలన అ దుకనర్హులు!"

కాని . స్వామీ! నేను సామాన్యమైన రెడ్డి కులానికి చెందిన వాణ్ణి! ఇట్టి పనులు నాకు కుదురుతవా?"

"వేమన్నా జాతిలో ఏముంది!
ఇన్నిజాతులందు నేజాతి ముఖ్యమన్
ఎరుక కల్గువారె యెచ్చువారు
ఎరుకలేని వారలేజాతినున్నను
హీనజాతియందు మ నెరుగువేమ!

నీ వలన ఈ లోకంలో జాతి వైషమ్యాలు నశించాలి!"

"దయామయా! మీ ఆజ్ఞను శిరసా వహిస్తున్నాను!"

"వేమన్నా! నా కర్తవ్యం పూర్తయింది. నీవు లెమ్ము! నీవు లెమ్ము! పొమ్ము! క్షణక్షణానికీ పతనమవుతున్న ఈ లోకాన్ని ఉద్ధరించు!

"స్వామీ! నేను లోక సంచారం చేస్తుంటే మోక్షమెలా వస్తుంది మీ వలె నేను గూడా తపస్సు చేయవద్దా?"

(తరువాయి 52 వ పేజీలో)

# గ్రంథసమీక్ష

## కాంతి రేఖలు

(సంకలనం: శ్రీ మన్నవ గిరిధరరావు, ఎం. ఏ., ప్రచురణ : యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ, శ్రీకృష్ణనగర్ : గుంటూరు-4, ⅛ క్రౌన్ సైజు; 130 పేజీలు; వెలనాలుగురూపాయలు

'జాతి పునరుజ్జీవనమునకు తోడ్పడే ఆలోచనా పరంపర, వ్యక్తికి సమాజం యెడలగల బాధ్యతలు, నిరంతర క్రియాశీలత' మొదలయిన మౌలిక సత్యాలు ప్రాతిపదికగా —'తమస్సునుండి జ్యోతిస్సులోనికి చేయిపట్టుకు నడిపించే స్నేహ హస్తాన్ని' యువతకు అందించడమనే అత్యుత్తమ లక్ష్యంతో ఆవిర్భవించిన సంస్థ —'యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ'. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారి అధ్యక్షతన ఈ సంస్థ—తన ఆదర్శాలు, ఆశయాలూ, కార్యక్రమాలూ రూపకల్పన చేసుకుంటూ అభ్యుదయ పథంలో పురోగమిస్తూ వుండటం ముదావహం. ఈ సంస్థ తన లక్ష్యసాధనకు అనుగుణంగా వెలువరించిన పుస్తకాలు—ఈ 'కాంతిరేఖలు'.

స్వరాజ్యం గురించిన అవగాహనం, పనిలోని మాధుర్యం; ఎందరో మహనీయులు; చిన్న కథలో పెద్ద గుణపాఠం, మాటా—మంతీ; దేశంయొక్క ప్రాతిపదికలు; సరియైన విద్య; ప్రాణంకంటే దేశం ముఖ్యం; చరిత్రనుండి గుణపాఠాలు — అనే తొమ్మిది విభాగాల క్రింద మొత్తం 78 రేఖాచిత్రాలు ఈ రెండు పుస్తకాల్లోనూ పొందుపరచబడినయి. ఒకే విభాగంలోని రేఖాచిత్రాలన్నీ ఒకే వరుసలో కాకుండా అక్కడక్కడా ఏర్పికూర్చబడినయి. వైవిధ్య గల కథలవంటి వ్యాస పరంపరని — ఇలా చదువరికి విసుగు కలిగించని రీతిలో-సంపుటీకరించటం సంపాదకుల చాతుర్యానికి నిదర్శనం.

శక్తివంతమైన కలం మాత్రమే-పాఠకుని గుండెని తాకేట్టుగా సందేశాన్ని అందించగలుగుతుంది. అలాంటి కలం బలంగల రచయిత శ్రీ మన్నవ గిరిధరరావుగారు. ప్రతిభా, వ్యుత్పత్తిగల మేధావి వారు. అందువల్లనే ఈ కాంతిరేఖల్లోని వచన ఖండికలన్నింటిలో వారిదైన ఒక 'చెప్పే తీరు' వుంది. ఆరోగ్యకరమయిన వస్తువు-చదివేందుకు, పదికాలాలపాటు మనస్సులో నిలిచేందుకూ—ఆహ్లాదకరంగా మలచి అందించబడింది.

యువతరంలో వ్యక్తిగత శీల సంపదని పెంపొందించటానికీ తద్వారా సమాజ శ్రేయస్సు సాధింపబడటానికీ — వుద్దేశించబడిన ఈ రెండు సంకలనాల్నీ Books of all times అనడం సముచితంగా వుంటుంది.

జాతి వికాసానికీ, నాగరికతాభివృద్ధికి కారణభూతుడయిన 'మానవుడి' లో సౌశీల్యాభివృద్ధి ప్రధాన ధ్యేయంగా సాగిన—ఈ కాంతి రేఖల్లోని భావ వాహిని, శబ్దద్యుతి, లీసారశ్యాలకు ఒకటి రెండు ఉదాహరణలు :—

'నేర్చుకోవడమనేది విద్యయొక్క మూలసూత్రం. ఒక సన్నివేశాన్ని చూచి దానివలన ఒక హెచ్చరికను, లేదా మార్గదర్శనమును పొందే రీతిలో నేర్చుకోవడమే విద్యయొక్క మౌలికమైన ఉద్దేశ్యం.

'ఒక వ్యక్తి ఎంతో గొప్పవాడు కావచ్చు. పరిపాలకుడుగానో, విద్యావంతుడుగానో, సైన్యాధినేతగానో, రాజకీయవేత్తగానో ఉన్నత పదవి నలంకరించవచ్చు. అయినప్పటికీ తన తల్లికి కుమారుడే అవుతాడు. అతనితల్లి అతన్ని 'ఏమండీ' అని పిలవదు. 'ఏరా' అనే పిలుస్తుంది. అదేవిధంగా ఆదర్శ పౌరుడు తన దేశానికి లొంగి వుంటాడు. దాన్ని అతిక్రమించడు. దేశంకంటే తాను అధికుడనని కలలోకూడా భావించడు.

'శాంతి కాలంలో ఎక్కువ చెమట కారిస్తే యుద్ధకాలంలో తక్కువ రక్తం కార్చవచ్చు ? (శిక్షణ ఆవశ్యకతని చెప్తూ ...)—

'నదికి రిజర్వాయరు కట్టడం యొక్క ఆంతర్యం— నీటిని నిల్వచేసి అలా వుంచివేయడం కాదు, కాలువలద్వారా పంటలకు వినియోగించడం. విద్యను పొందటం మాత్రమే కాదు; దానిని జీవన కార్యకలాపాలలో వినియోగించటం కూడా'—

'దేహభక్తి స్థానంలో దేశభక్తిని అలవరచుకుంటే తప్ప జాతికి పురోగతి వుండదు. దేశభక్తి అనేది అత్మలోపల వుంటే తప్ప సమాజమనెడి శరీరము తన కార్యకలాపములను సక్రమంగా నిర్వహించ జాలదు' —

చైతన్య పరిధిని విస్తృతపరచే విజ్ఞాన సర్వస్వాలనదగిన 'కాంతిరేఖలు'—స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్య లో వెలువడిన అత్యుత్తతమమైన రెండు పుస్తకాలు ! ప్రాథమిక పాఠశాల స్థాయినుండి, విశ్వవిద్యాలయ స్థాయివరకూ గల అన్ని విద్యా సంస్థల్లోనూ, అన్ని తరగతుల విద్యార్థులకూ ఒక పాఠ్యాంశంగా వీటిని నిర్ణయిస్తే ఎంతో బాగుంటుంది. విద్యార్థులకు వీటి ఆవశ్యకత అలాంటిది ! !

వి. శా.

## వేడిగాలి

(కవిత : సలంద్ర, ప్రజాసాహితి, నిజామాబాదు ప్రచురణ; మూల్యం రూ. 2-50; ప్రతులకు 8-5-402, డా. అంబేద్కర్ రోడ్, నిజామాబాద్).

కవిత్వం ప్రపంచాన్ని మార్చేస్తుందనీ, ప్రపంచమే కవిత్వానికి కొత్త రూపునిస్తుందనీ సిద్ధాంత రాద్ధాంతాలు చాలాఉన్నాయి. సమాజాన్ని కవిత్వమూ, కవిత్వాన్ని సమాజమూ ప్రభావితం చేయడమనే మాటమాత్రం అంతో ఇంతో నిజం కాకపోదు. కాని ఈ

కృషి నిత్యనూతన గా కొనసాగుతూ వు డవలసి_దేనేమో ! ఈ కవి ప్రగతి శీలి. యువకుడు, అభ్యుదయ భావాలున్న వాడుగా కవితా ఖ_డికలు చెబుతున్నవి. ఇ దులో 50 గీతాలదాకా వున్నాయి ఆశీస్సుల దజేసిన శ్రీ తెన్నేటి పూర్ణచ_ద్రరావుగారు "కవిత్వం కళ, ఈ కళలో ప్రజ్ఞ స_పాదించాలి" అ_టున్నారు. పుస్తక ప్రమరణ కర్తలైన ప్రజాసాహితి వారు "కళ, కళకోసమనే వాదన ఏనాడో వీగిపోయ్_ది. కళ సామాజిక ప్రయోజన_ కోస_ అనే దశలో మనమున్నా_. సామాజిక స్పృహ లేని రచయిత ఈనాడు రచయిత కాలేడు" అ_టున్నారు. ఇలాగే "సమాజ_లోని దోపిడీ వర్గ_ యొక్క నిజస్వరూపాన్ని బయటపెట్టి ప్రజల కళ్ళు తెరిపి_చ ట_ ఈ ప్రయోజన_లో ముఖ్యమైన విషయం" అని ప్రవచిస్తున్నారు. ఇ_దులో నాయకుడు, నాశన_, నువ్వు శీమచ్‌కావ్, అనే గీతాలు ఈ వర్గ పోరాటాన్ని, దోపిడి వ్యవస్థను గూర్చి రాసినవే అనిపిస్తు_ది. ఈ కావ్య స_కలనానికి శ్రీశ్రీ వ్రాసిన 'ము_దు మాట' చదవదగ్గది 'వ_ద వార్తా పత్రికలు చెయ్యలేని పని ఒక చిన్న గీత_ చేస్తుందని' శ్రీశ్రీ భరోసాగా చెప్తున్నారు పుస్తక సమీక్ష చేసేవాళ్ళపై శ్రీశ్రీ వీక్ష కూడా గమని_చదగి_దే గజ ద్విదితమైన సత్యాన్ని మళ్ళీ మరోసారి చాటారు శ్రీశ్రీ యీ ముందు మాటలో కవితా సమీక్షచేసే వారు అవశ్య_ గుర్తు_మకో వలసిన వాక్యాలు

బీభత్స, భయానకాలు ఈ వేడిగాలి ని_డా వున్నాయ_టున్నారు శ్రీశ్రీ కాని హర్లె_ నీడలు, లెబనాన్, అనివార్య_, రేపు, తప్పదు, వ_టి గీతాల్లో, కరుణ, లాలిత్య_ కనపడుతూనే వున్నాయి, స్వ పరిచయ_లో "కల్పిత కష్టాల ఊబిలో చిక్కుకున్న జన_ నా కవితకు ఊపిరి"అని కవిచెప్పడ_ దురవగాహ_గా ఉ_ది. సమాజ_లో కష్టాలు కల్పితమైనవే అనీ, అవన్నీ తొలగి పోయే శుభ తరుణ_ ఆసన్న_ కావడానికే కవుల_తా పూనుకోవాలని స్పష్ట_గా చెబితే బాగు_డేది లేకపోతే ఆ మాటలు అర్ధ_కావు. పుటలు 46, మూల్య_ రె_డున్నర రూపాయలు ఆధునిక కవితా ధోరణులు అర్థ_ చేసుకోదలచిన వార_తా, ఈ స_కలన_ ద్వారా కొన్ని విషయాలు అర్థ_ చేసుకోవచ్చు

—"మ_జుశ్రీ"

---

## స్వ ర్ణ యో గి

(50వ పేజీ తరువాయి)

వేమన్నా తపస్సుచేత మోక్ష_ వస్తు_దనట_ తప్పు ! మూఢ విశ్వాసాలతో క్రుళ్ళిపోతున్న స_ఘానికి నూతన జీవితాన్ని ప్రసాది_చి పుణ్య_ కట్టుకో ! నీకు మోక్ష_ వస్తు_ది !"

"స్వామీ నా చరిత్ర ప్రజలకు తెలుసు ! నేను చెప్పిన మాటలను విశ్వసిస్తారా ?"

"వేమన్నా ! ఇప్పుడు నీవు శ్రీకరుడవయ్యావు. నీవు చెప్పిన మాటలే వేదాలవుతాయి నీ మాట మహిమాన్వితమవుతు_ది

శ్రీకరు_డగు వేమన చెప్పినట్టి
పద్యముల నెవ్వడేనియు పరన చేయు
నట్టి పురుషుడు మనమున నిట్టిదనుచు
చెప్పరానట్టి వస్తువు చేరువేమ !

నిరక్షరకుక్షులు సైత_ నీ నీతులను అర్థ_ చేసుకు_టారు. నీవీ అడవిలో తిరిగి భగవ_తుణ్ణి దర్శి_చటానికి ప్రయత్ని_చకు !

అడవియడవితిరిగి యాసను విడలేక
గాసిపడెడువాడు ఘనుడుగాడు !
రోసిరోసి మదిని రూఢిగా నిలిపిన
వాడె పరముగన్న వాడువేమ

వేమన్నా ! పొమ్ము ! ప్రజలకు నీ బోధనామృతాన్ని ప_చు మానవజాతి ఉన్న_తకాల_ నీ నామ_ స్మరి_పబడుతు_ది "

గురుదేవుని పలుకులు విని వేమన్న సాష్టా_గ ద_డ ప్రణామాలాచరి_చి సెలవు గైకొని, గుహను_డి బైటకు వచ్చాడు

ఒక్క_సారి వెనక్కు తిరిగి చూశాడు
ఆశ్చర్య_ !

ఆ గుహ చీకటి గుయ్యారమై కనబడి_ది అ_దులో ల_బికా శివయోగి కనబడిలేదు !

గురుదేవుని మహాత్త్వానికి ఆశ్చర్యపడుతూ వేమన్న వెర్రివానిలాగా తనపైనున్న వస్త్రాలను ఒకదానివె_ట ఒకటిగా ఊడదీసి ఆ అడవిలో పారవేశాడు.

దిగ_బరుడై స_చరి_చట_ మొదలుపెట్టాడు.

(సశేష_)

# జిల్లా వార్తలు



## గుత్తి తాలూకాలో కమాండు ఏరియా అభివృద్ధి

గుత్తి తాలూకా కొజ్జేపల్లి సమీపానగల కమాండు ఏరియా అభివృద్ధి పథకం దిన దిన ప్రవర్ధమాన మవుతున్నది. ఈ పథకం తాలూకాలో సుమారు ఇరవై ఒక్క గ్రామాలలో 18,919 ఎకరాలలో ప్రవేశ పెట్టాలి. గుంతకల్లు నడి బొడ్డునుండి కాలువ త్రవ్వబడినది. ఈ కాలువకు తుంగభద్ర హైలెవెల్ కాలువ నుండి నీరు లభిస్తుంది. గుంతకల్లు నుండి వచ్చే ఈ కాలువ రెండుగా కుడి ఎడమ కాలువలుగా చీలుతుంది. ఇంతకు ముందు తుంగభద్ర నీరు అనుకున్నంత పైరు అందివ్వ లేకపోయింది. రైతులందరికీ సమానంగా, సరిసమంగా ఒకేసారి నీరు అందించే పథకమే "కమాండు ఏరియా అభివృద్ధి పథకం". అధికారులు 1977 జూ నుండి కమాండు ఏరియా భూములకు నీళ్లు వదిలే సన్నాహంలో వున్నారు. ఈ పథకంలో ఆరు తడి పైర్లు ముఖ్యమైనవి. ఆరు తడి పైర్లకు నవీన పద్ధతిలో మంచి విత్తనాలను వ్యవసాయ శాఖ వారు ఎంపిక జేసి, ఎరువులను సరఫరాచేసి బాగా పంట పండించే ఏర్పాటు చేస్తున్నారు. వర్షంపై ఆధారపడే అవసరం లేదు. పంట రాలదేమోనన్న సంశయం లేదు. తెగుళ్ళ బాధ దరి చేరదు. రాలుబడి తృప్తిగా వుంటుంది. పంట అధికంగా లభిస్తుంది.

అత్యంత ఆసక్తితో శ్రద్ధతో సాంకేతిక నిపుణుల నేర్పరితనంతో ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయంతో అహర్నిశలు ఏకాగ్రతతో పర్యవేక్షించే సిబ్బంది వున్నందున ఈ పథకం రైతులకు శ్రీరామ రక్ష. సహజంగా యిక్కడ పండించే ఆరు తడి పైర్లు జొన్న, సజ్జ, వేరుశనగ, రాగి, కొర్ర— వీటి కోత లయిన తర్వాత కూడా గోధుమ, శనగ, ధనియాలు, వేరుశెనగ రెండవ పైరుగా నాటుతారు. తుంగభద్ర నీటితో వరి పండించే కొందరు రైతులు అనంతపురం తాలూకా గార్లదిన్నె ప్రాంతంలో వరిని తీసివేసి 1976లో ఆరు తడి పైర్లు వేశారు. అంతకుముందు 15 లేక 16 క్వింటాళ్ళు దిగుబడి లభించిన జొన్న, ఆరుతడి పైరుగా 22 క్వింటాళ్లు వరకు లభించినందున యీ పథకంవల్ల కలిగిన లాభాలను, ఆరు తడి పైర్ల అవసరాన్నీ ఆ ప్రాంతం రైతులు గుర్తించారు. ఒక ఎకరా వరి పైరుకు సరిపడే నీరు 3 లేక 4 ఎకరాల ఆరు తడి పైరుకు సరిపోతుందని వ్యవసాయశాఖ సాంకేతిక నిపుణుల అంచనా. ఈ ఆరు తడి పైర్లు మూడున్నర నెలల కాలంలో పంట యిస్తాయి. తక్కువ వ్యవధిలో ఎక్కువ దిగుబడి యిచ్చే వంగడాలు వాడితే లాభం వస్తుంది.

అందుకే అన్ని తరగతుల రైతులూ యీ పథకాన్ని కోరుకుంటున్నారు. గుత్తి తాలూకా కమాండు ఏరియా అభివృద్ధికై గుంతకల్లు సహకార వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ఇప్పటి వరకు 246.50 ఎకరాల అభివృద్ధికి మొదటి వంతుగా 1,13,200 రూపాయలు అప్పుగా రైతులకు మంజూరు చేసింది 2,140 ఎకరాల అభివృద్ధికి ఆరుతడి పైర్లు ప్రవేశ పెట్టడానికి ఈ సహకార సంస్థకు రాష్ట్ర ప్రభుత్వం 16 లక్షల 60 వేల రూపాయలు రుణంగా ఇచ్చింది.

ఈ అప్పుల వసూలు కూడా క్లిష్టంగా ఉండదు. అప్పు మంజూరయిన మూడవ సంవత్సరం నుండి అసలు, వడ్డీ వసూలు చేస్తారు. మొదటి రెండు సంవత్సరాలు 11% వడ్డీ వసూలు చేస్తారు. పెద్ద రైతులు పది సంవత్సరాలలో, చిన్న రైతులు అనగా ఐదు ఎకరములుగల రైతులు 12 సంవత్సర వాయిదాలలో అప్పు తీర్చుకోవచ్చు. స్టేటు బ్యాంకు వారు ఈ పథకం క్రింద రైతుల అభివృద్ధికి 20 లక్షల రూపాయాలు కేటాయించారు

అంతేకాక కొజ్జేపల్లి గ్రామంలో గొ ల పెంపకానికి లక్ష రూపాయలు విలువ జేసే మేలు జాతి గొర్రెలను సరఫరా చేయడానికి అధికారులు సన్నాహాలు చేశారు.

—శ్రీ డి. యస్. కృష్ణమూర్తి

## శ్రీకాకుళంలో బలహీన వర్గాలవారికి రుణాల పంపిణీ

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ మే 28 వ తేదీన శ్రీకాకుళంలో కలక్టరేట్ ఆవరణలో ఒక బహిరంగ సభను ద్దేశించి ప్రసంగిస్తూ సహకార ఉద్యమం నిర్మాణాత్మక కృషి ఆవశ్యకతను గురించి నొక్కి వక్కాణించారు. సహకారోద్యమం ప్రస్తుతం బహుముఖంగా వ్యాప్తి చెందుతున్న దృష్ట్యా సాంఘిక సంక్షేమ కార్యకలాపాలను ఈ జిల్లాలో అత్యంత ఆదర్శవంతంగా నిర్మాణాత్మకంగా అమలు జరుపవచ్చునని అన్నారు.

గ్రామీణ వృత్తి పనులవారినీ, రైతులనూ సహకార రంగం పరిధి లోనికి తీసుకొని రావాలి. వృత్తి పనివారు తమ సామర్థ్యంతో ఆత్మవిశ్వాసం పెంపొందించుకోవాలని ఇతరులపై ఆధారపడరాదని గవర్నరు ఉద్బోధించారు.

మహారాష్ట్రలోని సహకారోద్యమాన్ని ప్రస్తావిస్తూ గవర్నరు మహారాష్ట్రలోని గ్రామీణ ప్రాంతాలలో ప్రజలు విద్యావంతులు కానప్పటికీ చక్కెర, ప్రత్తిపరిశ్రమల్లో అసంఖ్యాకంగా పాల్గొనటం వల్ల సహకార కార్య కలాపాల్లో ముందంజ వేయటం జరిగిందని అన్నారు. బలహీన వర్గాలవారు తమ కాళ్ల మీద తాము నిలబడడానికి సహకార రంగం ఆవశ్యకత ఎంతైనా వున్నదని ఆమె అన్నారు.

తొలుత గవర్నరుగారికి స్వాగతం పలుకుతూ జిల్లాకలెక్టర్ శ్రీ ఎస్. కె. పచౌరీ తమ ప్రసంగంలో గత ఆరు సంవత్సరాల్లో





పై చిత్రాలు : చక్కెర పరిశ్రమలు, వెనుకబడిన వర్గాల సంక్షేమం శాఖామాత్యులు శ్రీ కె. వి. నరసప్ప కడపలో చక్కెర కర్మాగారం సందర్శించారు



## జిల్లాలో వార్తాచిత్రాలు

ఎడమవైపు మధ్య : మే 16న మెదక్‌లో జిల్లా పత్రికా రచయితల సంఘం సర్వసభ్య సమావేశంలో జిల్లా కలెక్టరు శ్రీ ఇ. ఏ. ఎస్. శర్మ ప్రసంగం.



ఎడమవైపు క్రింద : ఎన్.ఎస్.ఎస్. వాలంటీర్లు మెదక్ జిల్లాలో నూతనంగా నిర్మించిన "ఆనంద్ నగర్" హరిజన కాలనీకి కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

రు. 615 లక్షల మేరకు 70,000 మంది సన్నకారు రైతులకు వివిధ సంక్షేమ పథకాల క్రింద అందజేయడం జరిగిందని వీటిలో రు. 464 లక్షలు సంస్థాగత ఆర్థిక సహాయం రూపేణా, రు. 10 లక్షలు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ కార్యక్రమం క్రింద పంపిణీ చేశారని అన్నారు.

పాడి పశువులు, భూమి దున్నే ఎద్దులు, పెంపకం కోసం పందులు, చేపలు పట్టేందుకు పరికరాలు, నీటిపారుదల బావులు, ఆయిల్ ఇంజన్ల కొనుగోలు నిమిత్తం 961 మందికి రు. 10 లక్షల మేరకు గవర్నరుగారు రుణాలు పంపిణీ చేశారు.

తరుగాత గవర్నరు హిందూపురంలో ఖాదీ ప్రదర్శనను తిలకించారు.

## వెనుకబడిన వర్గాలకు రుణాల పంపిణీ

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీమతి శారదాముఖర్జీ, మే 25 న విశాఖపట్నానికి 35 కిలోమీటర్ల దూరంలోని సబ్బవరంలో జరిగిన బహిరంగసభలో వెనుకబడిన వర్గాలకు 14 లక్షల మేరకు రుణాలను పంపిణీచేశారు. బ్యాంకులు మంజూరు చేసిన రుణాలను తగిన విధంగా ఉపయోగించుకొని గ్రామీణ ప్రాంతాల ప్రజల ఆర్థిక అభ్యున్నతికి దోహదం చేయాలని, గ్రామాల నుండి దారిద్ర్యాన్ని పారద్రోలాలనీ అన్నారు. సామాన్య మానవుని పునరుజ్జీవనానికి కృషిచేయాలనీ అందుకు తగు విధంగా తమ సహాయసహకారాలను అందజేయాలనీ గ్రామ పంచాయతీ సమితులకు గవర్నరు విజ్ఞప్తి చేశారు.

గిరిజన సంక్షేమ శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి అధ్యక్షత వహించారు.

విశాఖపోర్టు ట్రస్టు అధ్యక్షుడు శ్రీ బి. కె. రావు సభికులకు స్వాగతం చెప్పారు.

బెందుర్తిలో గవర్నరు సాంఘిక సంక్షేమ బాలల హాస్టలు భవనానికి ప్రారంభోత్సవం చేశారు. రు. 1 లక్ష ఖర్చుతో నిర్మించబడిన ఈ హాస్టలులో 30 మంది విద్యార్థులకు ప్రవేశం కల్పిస్తారు.

## అనంతపురంలో సెమినార్

అటవీశాఖ మంత్రి శ్రీ ఇబ్రహీం అలీ అన్సారీ, అనంతపురంలో మే 23 న క్షామ పీడిత ప్రాంతాల కార్యక్రమానికి చెందిన అటవీ పనులకు సంబంధించిన సెమినారుకు, వర్కుషాపుకు ప్రారంభోత్సవం చేశారు. ఆయన ఈ సందర్భంగా ప్రసంగిస్తూ లాభసాటికాని వ్యవసాయ భూములను సేకరించి పశుగ్రాస క్షేత్రాభివృద్ధి నిమిత్తం వాటిని అటవీశాఖకు దత్తం చేయడంలో చొరవ తీసుకొని కృషి చేసినందుకు కలక్టరును అభినందించారు.

అటవీ శాఖ ప్రధాన సంరక్షణాధికారి శ్రీ పి. యస్. రావు ప్రసంగిస్తూ ఈ జిల్లాలో ఆర్థికాభివృద్ధికి వీలుగా గొర్రెల పెంపకం, పశుగ్రాసాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టాలని ఉద్బోధించారు. అడవుల అభివృద్ధికి దోహదం చేసే విధంగా అడవుల పెంపకం, చెట్లునాటడం కార్యక్రమాలను అమలు జరపడానికి జిల్లా చెట్లనాటే విషయాల సంఘాలను ఏర్పాటు చేస్తారని ఆయన అన్నారు.

సెమినారుకు అధ్యక్షత వహించిన జిల్లా కలెక్టరు శ్రీ కె.యస్. శర్మ ప్రసంగిస్తూ జిల్లాలో గొర్రెల పెంపకం కార్యక్రమాన్ని చేపట్టినందువల్ల బ్లాంకెట్లను నేసే చిన్నవృత్తి కళాకారులకు ఎంతో సహాయం కలుగుతుందని ఈ ప్రాంతాలలో బ్లాంకెట్ల నేత ప్రధానవృత్తిగా ఉన్నదని అన్నారు.

## నిజామాబాదు జిల్లా అభివృద్ధి కార్యక్రమాలు

తెలంగాణా ప్రాంతంలో వ్యవసాయికంగా బాగా అభివృద్ధి చెందిన జిల్లాలో నిజామాబాదు జిల్లా ఒకటి. ఈ జిల్లాలో 1958–61లో 6.76 లక్షలఎకరాల పంట విస్తీర్ణం ఉండగా, 1975 నాటికి అది 9.12 లక్షల ఎకరాలకు పెరిగింది. అదే విధంగా నీటి పారుదల విస్తరణ కూడ 3.18 లక్షల ఎకరాల నుండి 4.64 లక్షల ఎకరాలకు పెరిగింది. జిల్లాలో వరి, జొన్న, మొక్కజొన్న, వేరుశనగ, చక్కెర ముఖ్యమైన పంటలు.

నిజామాబాదు, పోచంపాడు, పోచారం, రామడుగు ప్రాజెక్టులు ఇక్కడి ప్రధానమైన నీటివనరులు. వాటిక్రింద 2,55,684 ఎకరాలకు సేద్యపు నీటిబావులు ఉన్నాయి. వాటిలో 10,616 బావులకు విద్యుచ్ఛక్తి మోటారు పంపుసెట్లు, 4,926 బావులకు అయిల్ ఇంజన్ పంపుసెట్లు ఉన్నాయి. అంతేగాక, 2,462 చెర్వులు, 672 గొట్టపు బావులు ఉన్నాయి.

## నిజామ్‌సాగర్ రీమోడలింగ్ పథకం

ఈ జిల్లాలో ప్రధానమైన నీటి పథకంగా వున్న నిజాంసాగర్ ప్రాజెక్టు రిజర్వాయరులో మేట వేయడం సమస్యను యిప్పుడు ఎదుర్కొంటున్నారు. ఈ మేట ప్రతి సంవత్సరం 418 మిలియన్లు క్యూబిక్ అడుగులు వంతున పెరుగుతున్నది. మామూలుగా 48 మిలియన్ల క్యూబిక్ అడుగుల మేట వేయడం సర్వసాధారణంగా జరుగుతుంటుంది. తత్ఫలితంగా రిజర్వాయరు నీటి నిలువశక్తి 11 వేల మిలియన్ల క్యూబిక్ అడుగులు తగ్గిపోయింది. మొదట్లో ఈ రిజర్వాయరు నీటి నిలువశక్తి 25,600 కు ఉండేది.

అందువల్ల రిజర్వాయరు కట్టను వరదగేట్లను ఎత్తు పెంచడం ద్వారా నిలువశక్తిని పెంచడానికి వీలుగా ప్రభుత్వం పునర్నిర్మాణ పథకాన్ని చేపట్టుతున్నది. ఈ పనులకు రు. 2.5 కోట్లు ఖర్చు అవుతుందని అంచనా, ఇందుకోరకు ప్రత్యేక నిధులను విడిగా కేటాయించారు.

జిల్లాలలో లీడ్ బ్యాంకుగావున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు లీడ్‌బ్యాంక్ పథకం క్రింద 5వ ప్రణాళికా కాలంలో నిజామాబాదు జిల్లాకు పరపతి ప్రణాళికలు రూపొందించింది. జిల్లాలో ప్రజల అవసరాలను దృష్టిలో ఉంచుకొని జిల్లా వనరుల ప్రాతిపది

కగా రంగంలోవున్న అంశాలకు వర్తించేవిధంగా సమగ్ర అభివృద్ధియే ఈ పరపతి ప్రణాళిక ప్రధానప్రయోజనం.

1976-77 వరకు ప్రణాళికను తయారుచేశారు. ఈ ప్రణాళిక మొత్తం రు 23 87 కోట్లు, దానిలో రు.20.67 కోట్లు వ్యవసాయానికి రు. 2.47 కోట్లు పరిశ్రమలకు, రు. 0.73 కోట్లు సాంఘిక సేవకు కేటాయించారు.

1978-79-లో రు. 14.60 కోట్లు మేరకు పంటల రుణాలను పంపిణీ చేయాలని పరపతి ప్రణాళిక ఉద్దేశిస్తున్నది. దానికి తోడు భూమి అభివృద్ధి నిమిత్తం, 17 వేల ఎకరాలకు ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. 15,000 ఎకరాలకు అదనపు నీటి సౌకర్యాలను కలుగజేస్తున్నారు. 6,900 మంది రైతులకు పంపుసెట్లు ఏర్పాటు, బావుల త్రవ్వకానికి ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. పాడి పరిశ్రమ గొఱ్ఱెల పెంపకం పథకాలకు యిచ్చే రుణాలతో సహా ఈ రుణాలు మొత్తం రు 6.03 కోట్లు ఉంటుంది.

జిల్లా పరపతి ప్రణాళికలో 863 లఘు పరిశ్రమలు, 5,458 గ్రామీణ వృత్తి పనివారలకు రు. 2.47 కోట్లు ఆర్థిక సహాయం లభిస్తున్నది. ఇందువల్ల 8,400 మందికి అదనపు ఉపాధి లభిస్తుంది.

సాంఘిక సేవారంగంలో 15 ఎరువులు, క్రిమిసంహారక మందుల దుకాణాలు, 18 సహకార దుకాణాలు, ఎద్దుబండ్లు, ట్రక్కులు, సైకిల్ రిక్షాలతో సహా 205 మంది రవాణా ఆపరేటర్లకు, 705 వైద్యులు, హోటళ్లు మొదలైనవాటితో సహా 943 చిన్నపాడి వ్యాపార యూనిట్లకు ఆర్థిక సహాయం అందజేయాలని ప్రతిపాదించారు. ఈ ప్రణాళికా కాలంలో సాంఘిక సేవారంగానికి రు. 73.0 లక్షలు కేటాయించారు. ఈ పథకం వలన 1,416 మందికి ఉద్యోగాలు లభించవచ్చు.

## జిల్లా ప్రణాళిక

5వ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగ నివారణ, దారిద్ర్యం నిర్మూలన, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి, రాష్ట్రాల ఆర్థిక రంగంలో ప్రాంతీయ అసమానతల తొలగింపు ప్రధాన అంశాలుగా ఉన్నాయి. తదనుగుణంగా రాష్ట్ర ప్రణాళికలను, జిల్లా ప్రణాళికలను రూపొందించారు.

ఈ ప్రణాళికా పెట్టుబడులలో రాష్ట్ర ప్రణాళికా రంగం, కేంద్ర పరమైన పథకాలు, 6 సూత్రాల పథకం సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థ, సహకార సంఘాలు, అడ్వాన్సులు, షెడ్యూల్డు కులాలు, వెనుకబడిన తరగతుల కార్పొరేషన్ మహిళా శిశు సంక్షేమ కార్పొరేషన్ పరిశ్రమల శాఖ కేటాయింపులు ఉన్నాయి.

నిజామాబాదు జిల్లాకు 1976-77 వార్షిక ప్రణాళికకు రూ. 1,048.27 లక్షలు కేటాయించారు.

# పంచాయతీరాజ్ స్పెషల్ ఆఫీసర్లకు మంత్రి సలహా

పంచాయతీరాజ్ శాఖా మంత్రి శ్రీ ఎల్. లక్ష్మణదాసు యిటీవల చిత్తూరులో జరిగిన స్పెషల్ ఆఫీసర్లు, జిల్లా అధికార్లు, బ్లాక్ అభివృద్ధి అధికార్ల సమావేశంలో ప్రసంగిస్తూ, గ్రామీణాభివృద్ధి పంచాయతీరాజ్ శాఖపై ఆధారపడివున్నదని అందుకొరకే ప్రతి సమితికి స్పెషల్ ఆఫీసర్లను నియమించారని అన్నారు. స్పెషల్ ఆఫీసర్లు నెలకు రెండు తడవులు తమ సమితులలో పర్యటించాలని ఆయన సలహా యిచ్చారు.

పట్టణ ప్రాంతాలలో ప్రతివ్యక్తిపై రూ. 165 ఖర్చు చేయబడుతున్నదని, గ్రామీణ ప్రాంతాలలో ప్రతి వ్యక్తిపై కనీసం రూ. 10 లైనా ఖర్చు చేయాలని ప్రభుత్వం నిర్ణయించిందని మంత్రి అన్నారు. ఈ అధికార్లు తమ విధి నిర్వహణలో గ్రామీణాభివృద్ధికి ప్రత్యేక కృషి జరపాలని ఆయన ఉద్బోధించారు.

రాష్ట్రంలో మంచినీటి సౌకర్యం కల్పించడానికి ప్రపంచ బ్యాంకు రూ. 60 కోట్లు కేటాయించిదని మంత్రి వెల్లడించారు. ప్రతిజిల్లా అధికారి ఒక గ్రామం చొప్పున దత్తం చేసుకొని ఆ గ్రామ తీవ్రతరాభివృద్ధికి కృషి చేయాలని, గ్రామీణ ప్రజలతో కలసిమెలసి తిరగాలని మంత్రి ఉద్బోధించారు.

జిల్లా కలక్టరు శ్రీ డి. రామకృష్ణయ్య ప్రసంగిస్తూ ప్రతి జిల్లా ఆఫీసరు ఒక గ్రామాన్ని దత్తం చేసుకొని గ్రామీణాభివృద్ధికి ఎక్కువ కాలాన్ని వినియోగిస్తారని హామీ యిచ్చారు.

# ఒంగోలులో మలేరియా శిక్షణ శిబిరం

జాతీయ మలేరియా నివారణ పథకం క్రింద క్రొత్త రీతి చర్యల్లో శిక్షణ ఇచ్చేందుకు ఒంగోలులో జిల్లా వైద్య ఆరోగ్య కేంద్రం మే 23 నుండి 28 వరకు శిక్షణా శిబిరం నిర్వహించారు. జిల్లా వైద్యశాఖాధికారి డా. ఎన్. వెంకటసుబ్బయ్య ఈ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రకాశం జిల్లాలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో పనిచేస్తున్న 20 మంది వైద్య అధికారులు యీ శిబిరంలో పాల్గొన్నారు. మలేరియా వల్ల మరణించడాన్ని నివారించేందుకు తీసుకోవల్సిన చర్యలను గూర్చి యీ నవీన శిక్షణ కార్యక్రమంలో తెలియజేసారు. డి. డి. టి. వంటి వ్యాధి నిరోధక మందులను తదితర మందులను ప్రభుత్వం ఉచితంగా సరఫరా చేస్తుంది.

మే 28 వ తేదీన శిక్షణా శిబిరం ముగింపు ఉత్సవం జరిగింది. జిల్లా కలెక్టరు శ్రీ ఆర్. వి. వైద్యనాథ అయ్యర్ ముగింపు ఉపన్యాసం చేశారు.

జిల్లా మలేరియా అధికారి శ్రీ టి. ఎన్. రాజ్ మోహన రావు వందన సమర్పణ చేశారు.

PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT OF ANDHRA PRADESH, AT THE GOVT CENTRAL PRESS, HYDERABAD
PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS ANDHRA PRADESH, HYDERABAD

# స్వీయ చరిత్ర ఆధారంగా - బుజ్జాయి

తనకు ఉన్న ఆస్తి యావత్తూ 43500 రూ-లు ఈ సమాజం పేర వ్రాసేరు- వీరేశలింగం.

ఈ సమాజం తరఫున నడుస్తున్న పాఠశాలను ఉన్నత పాఠశాలగా చేశారు.




1908లో ప్రభుత్వం వారు వీరేశలింగాన్ని రిజిస్ట్రార్ ఆఫ్ మారేజస్‌గా నియమించారు-



ఇదివరలో వీరేశలింగం ఎక్కడికి వెళ్ళినా దూషించే వారు-



ఇప్పుడు ఎక్కడకు వెళ్ళినా గౌరవిస్తున్నారు



పండిత శివనాథ శాస్త్రిగారి ఆహ్వానంపై వీరేశలింగం భార్యతో కలకత్తా వెళ్ళారు. అక్కడ బ్రహ్మసమాజం వారు అఖండంగా గౌరవించారు.



ఆ సంవత్సరమే బెంగుళూరులో వర్ధమాన సమాజం వారు వీరేశలింగాన్ని సన్మానించారు. మైసూరులో కూడా స్వాగతం ఇచ్చారు.



చెన్నపట్నం గవర్నర్ లాలీదొర రాజమహేంద్రవరం వచ్చినప్పుడు- వీరేశలింగాన్ని కలుసుకున్నారు.







తన దగ్గర డబ్బు అంతా పెట్టి ఒక స్థలం కొన్నారు.




పిఠాపురం మహారాజుగారికీ సంగతి తెలిసింది. పాఠశాల భవన నిర్మాణానికి రూ 60000 ఇచ్చారు. వీరేశలింగం దగ్గరుండి భవనం కట్టించడము ప్రారంభించారు-



